

శ్రీమతి సరోజినీ దేవి

జననము 13-2-1879 : మరణము 2-3-1949

# సరోజినీదేవి



రచయిత :

శ్రీ సరస్వతీపుత్ర

పుట్టపర్తి నారాయణాచార్యులు



సంస్కృతి ప్రచురణ

(62)

వెల రూపాయి

# విషయసూచిక

# మనవి

మనకు స్వాతంత్ర్యము లభించినది. కాని స్వార్థ రహితులై యా స్వాతంత్ర్యమును సంపాదించి యిచ్చిన మహా మహుల చరిత్రలు – ఏ యొక్కరిదైన – సంగ్రహముగనైన – లభింపకున్నవి. వారి చరిత్రలు మన విద్యార్థుల కాదర్శ ప్రాయములై వారిని జక్కని పౌరులను గావించుట కత్యం తావశ్యకములు కదా!

శ్రీ సరోజినీదేవి అట్టి మహామహులలో నగ్రగణ్యు రాలు. ఆమె స్వాతంత్ర్యసిద్ధికై, స్వార్థరహితముగా నొన రించిన యమూల్యకృషి యనన్య సామాన్యము. ఆమె జీవి తము మన విద్యార్థుల నుత్సాహభరిత హృదయులను గావించి యుత్తమ పౌరుల నొనరింపఁ గలదను విశ్వాసముతో నిట్లు సంగ్రహ రూపమున బ్రకటితమైనది.

# 1. సరోజినీదేవి కుటుంబము

శ్రీమతి సరోజినీదేవి కుటుంబ మతి ప్రాచీనమైనది. వారు విప్రులు. తూర్పు బెంగాలునందు వారు చాలకాలముగ నివసించెడు వారు. నేఁ డా భాగమంతయుఁ బాకిస్థానులోఁ జేరిపోయినది. వా రా భాగమును నేఁడు తూర్పు పాకిస్థాన మని పిలుతురు.

ఆ వంశీయులందఱును ఛటోపాధ్యాయులు ; చక్కని సంస్కృత పండితులు. వేదములను, శాస్త్రములను జక్కఁగా నభ్యసించుట వారి పరిపాటి. ఒకరిద్దరు కారు ; ఆ వంశ మునఁ బుట్టిన వారందఱి కిది యవశ్యవిధి. ఈ యాచారము నూర్లకొలఁది వర్షములుగ నా వంశమున వచ్చుచునే యుండెను. వారు వేదముఁ దాము చదువుటమాత్రమే కాదు; కులపతులై యితరులచేతఁ జదివించుచుండిరి కూడ. బెంగాలు దేశమున వారి కమిత గౌరవము. సంస్కృత విద్య కా వంశము మూలస్తంభమని యా జనులు భావించుచుండిరి. వారి సంస్కృత పాండిత్య మంతటిది! వారి కా భాషపైఁ గల ప్రేమ యంతటిది!

సాధారణముగఁ బండితులు పాండిత్య భుక్కులు. వారు జనులపొత్తు సహింపరు ; ఇంటిలోఁ గూర్చుండి యింద్ర లోకములను, నందనోద్యానములను సృష్టించుటయే కాని, పట్టుమని పదిరోజులు వరుసగఁ బచ్చిక బీళ్ళలో సంచరించి యెఱుఁగరు ; కాఱడవులను వర్ణింతురు ; వా రడవులలోని

కెన్నఁడును బోవరు. ఉత్తుంగ పర్వతములు, తరంగితములైన నదులు, గుస గుసలాడుకొనుచున్న సెలయేఱులు—ఇవన్నియు వారి పాలికిఁ బుస్తకముల మాటలే. ఈ వంశమున కా దురభ్యాసము లేదు. వారు ప్రకృతితోఁ గలసి తిరిగిరి; కొండలలో సంచరించిరి; పుష్పముల రహస్యములు వినిరి; తుమ్మెదలు పాడుచున్న గానముల కానందించిరి; సీతాకోక చిలుకలు, మిణుగురుఁ బురుగులు వచించు చిక్కని కథలను జెవియొగ్గి వినిరి. పరుగెత్తి పోవుచున్న వాహినీ తరుణుల ప్రయాణము లడిగి తెలిసికొనిరి; ప్రకృతి యంకమునఁ బెరిఁగిరి. అనంత వ్యాపారములచేత హో రని ధ్వనించుచున్న కార్యమయ జగత్తునుండి తప్పించుకొని యీ వంశీయులు కొన్ని కొన్ని దినము లడవులలోనే చెట్టు పుట్టలతోఁ గడపెదు వారఁట! కవులకుఁ బ్రకృతి తల్లి. వా రామె యంకమునసే పెరుఁగుదురు. ఛటోపాధ్యాయ వంశమువారి కీ గుణ ముండెను.—అనఁగా వారిలోఁ గవిత దాఁగి యుండె నన్నమాట!

సరోజినీదేవి తండ్రిపేరు అఘోరనాథ ఛటోపాధ్యాయులు. ఇతఁడును జక్కని సంస్కృత పండితుఁడు; కవితా హృదయముఁ గలవాఁడు; వేదశాస్త్రములు చదివినవాఁడు. ఇతని కాలమున కాంగ్ల విద్య భారత దేశమున వ్యాపించినది. అవి విక్టోరియా కాలము నాఁటి దినములు. నాఁడు భారతీయుల కాంగ్లముపై నొక క్రొత్త యభిరుచి.

అఘోరనాథుఁ డీ యవకాశమును బాగుగ వాడుకొన్నాఁడు. ఆంగ్లమున నతఁడు గొప్ప వేత్త.

ఇంతటితో నతఁడు దృప్తిపడ లేదు. గ్రీకు, హీబ్రూ మొదలైన ప్రాచీన భాషల నాతఁడు నేర్చెను; ఫ్రెంచి, జర్మనీ మొదలగు యధునాతనభాషల నాకళించెను. చిన్నఁదనమునం దఘోరనాథుఁడు చిలిపి చేఁతల కంటెను జనువునే యెక్కువ తలఁచెను. ఇఁకఁ బెద్దవాఁడైన తరువాత నందవా ప్రతిదినము లోని ప్రతి నిమేషము నాతనికి వెలగలదియే! ఆ మహనీయుని విజ్ఞాన తృష్ణ కంతులేదు. విద్యార్థి దశలోఁ దోడి వారందఱి కంటె నాతఁ డన్నిటిలో మొదటివాఁడు. పెద్దవాఁడైన పిదప నాఁటి పెద్దలలో నెల్ల నాతఁడు విజ్ఞాన వృద్ధుఁడు.

ఆతనికి రసాయన శాస్త్రముపైఁ బ్రత్యేకమైన యభిమానము. విద్యార్థి దశనుండియు దాని నాతఁ డాసక్తితోఁ జదివెను. అతఁ డా శాస్త్రమున విశేషజ్ఞానము నార్జించుటకై పరదేశములకు వెళ్ళఁదలఁచినాఁడు. తొలుత జర్మనీ చేరెను. 'బాన్' విశ్వవిద్యాలయమున భౌతిక శాస్త్రమందు డాక్టర్ పట్ట మాతఁడందెను. తరువాత నాతఁడు ఎడింబరోకు వెళ్ళినాఁడు ; అచ్చటఁ గూడఁ బరిశోధన లొనర్చి గొప్ప గౌరవము లందెను; కడకు 1877-వ సంవత్సరమున స్వదేశమునకుఁ దిరిగి వచ్చినాఁడు. ఆతని కుద్యోగము హైదరాబాదులోఁ గుదిరెను. హైదరాబాదు నిజామున కఘోర

నాథుని చదువుపై నెంత గౌరవమో యాతని సద్గుణములపైఁ గూడ నంతటి భక్తి.

నిజాము క్రొత్త కళాశాల నొక దానిని నెలకొల్పఁ దలఁచెను. ఆ విషయమున సాయమొనర్పవలసినదిగా నాతఁ డఘోరనాథుని యాచించినాఁడు. ఛటోపాధ్యాయుఁ డంగీకరించెను. అతఁ డా కాలేజి ప్రిన్సిపాల్ అయినాఁడు. అఘోరనాథుఁ డధినేత యగుటచే నా పదవికే గౌరవము కలిగినది. కాని, యాతని కా పదవిలోఁ గ్రొత్త గౌరవము రాలేదు. కొందఱిట్లే యుందురు. వారి కొక గౌరవము గలుగుట యా గౌరవమునకే గౌరవము. అఘోరనాథుఁ డక్కడనే యుద్యోగధర్మమున శాశ్వతముగ నిలిచిపోయెను.

అతఁడు గొప్ప దేశభక్తుఁడు ; సత్యము నభిమానించువాఁడు. పరదాస్యముచే దళితమై పోవుచున్న భారత జాతి దీనావస్థ నాతఁడు గమనించెను ; ఒకటి రెండు సారులు సభలలో దీని విషయమై తన పరితాపమును వెల్లడించెను; ఆంగ్ల పరిపాలకులను గూర్చియుఁ గొన్ని సభలలోఁ దీవ్రమైన యసమ్మతిని బ్రకటించెను. ఈ వార్తలు సవసవగా నవాబు చెవి కెక్కినవి. ఆతని కతృప్తి కలిగినది. బ్రిటిషు వా రాతనికిఁ బ్రభువులు. వారినిఁ దూలనాడుట తన్నుఁ దూలనాడినట్లే యాతఁ డెంచెను. ఆ నాఁటి రాజభక్తి యంతటిది! అతఁ డఘోరనాథునిఁ బిలిచి "మీ రిట్లనుట పొరపా"టనెను; "ఇది యెన్నఁడైన విచారణకు వచ్చినచో నే నిట్లనలేదని తెల్ప

వలసిన" దని యఘోరనాథున కసత్య పాఠములు బోధింపఁ జొచ్చెను. కాని, యాతఁడు వినలేదు. తాత్కాలికముగ హైదరాబాదును వదలిపోవలసినదని నవాబు చెప్పెను. అతఁ డంగీకరించెను. ఆత్మవంతుల దృష్టిలో హృదయ వంచన మహాపాపము గదా! సరోజినీదేవి తల్లి పేరు వరద సుందరి. ఆమె నిక్కమైన గృహిణి. భర్తయొక్క చిత్తానువృత్తియే యామె జీవితము. బెంగాలీ భాషలో వరదసుందరి కవితలఁ గూడ నల్లఁగల్గి యుండెను. వాని నామెయే పాడును. ఆమె గొంతులోఁ గోకిలలు పల్కుచుండెడివి. అఘోరనాథున కామె యొక శాంతి ప్రదాత్రి. పనులతో విసుగెత్తి నపు డాతఁడు వరదసుందరిచే నేమైనను బాడించుకొని వినుచుండెడి వాఁడు. వైష్ణవగీతము లామె యద్భుతముగ గానము చేసెడిది; అప్పుడప్పుడు దన రచనలను గూడఁ జదివి విని పించుట వాడుక. ఆమె రచనలు సామాన్యమైనవి గావు. నాఁటి కవులు వాని నెంతో గౌరవించెడి వారు. అఘోర నాథుని గృహము సంగీత సాహిత్యములకుఁ గాణాచి యనుట నాఁటి మిత్రు లనుకొనెడిమాట.

సరోజిని కిట్టి తలితండ్రు లుండుట మహాభాగ్యము. వీరిద్వరి యేకరూపమే సరోజినీ జీవితము. మాతృగుణమైన కవిత యామెకు రక్తగతమైనది; తండ్రియందుండిన దేశ భక్తి, యాత్మ విశ్వాసము, సత్యారాధనము—ఈ గుణములు గూడ నామె కంటివచ్చెను.

# 2. బాల్యము - విద్యాభ్యాసము

వరదసుందరీదేవికి సరోజిని మొదటి సంతానము. ఆమె తరువాత నార్వురుపిల్ల లాయింటిలోఁ బుట్టిరి. వారిలో ముప్వురు కొడుకులు; తక్కినవా రాఁడుపిల్లలు. ఛటోపాధ్యాయునిగృహ మెప్పుడు నీ పిల్లలతోఁ గలకల లాడుచుండెను. తండ్రియైన యఘోరనాథునికి దిక్కులేనంత మంది మిత్రులు. వారెల్లప్పుడు నీతని యింటి కరుదెంచెడి వారు. అఘోరనాథుని కతిథులను గౌరవించుటలో నెక్కువ యాదరము. అందుచే బందుగులు మొదలగువా రప్పుడప్పు డాతనియింట నుండెడివారు. వారెల్ల రకీపిల్లలను జూచిన నమితప్రేమ.

వరదసుందరీదేవి యన్నిరీతుల ఛటోపాధ్యాయులకుఁ దగిన గృహిణి యని చెప్పితిమిగదా! ఇంటిపనులతో నామెకుఁ దీఱిక చిక్కెడిదిగాదు. కాని, యామె గడుంగడు నోర్పు గలది. పనులలో నెప్పుడు విసిగికొని యెఱుఁగదు. కాసంత తీఱిక దొరకినచో నామె దృష్టి కవితలవైపు మరలెడిది. సరోజినీదేవి కచ్చుగ్రుద్దిన ట్లన్నియుఁ దల్లిగుణములే! ఈ కళాహృదయమును దల్లి గనిపెట్టినది. ఆమె దానినిఁ బ్రవృద్ధ మొనరింపఁ దలఁచెను. వరదసుందరి బిడ్డ కెప్పుడును జక్కని కథలను జెప్పెడిది. ఆమె పనిచేసికొనుచున్నప్పుడు గథలు వినుచు సరోజినీదేవి దల్లివెంట వెంటఁ దిరుగుచుండును. ఆమె చెప్పునది కాకమ్మ కథలే కాదు; గొప్పవారి జీవిత

గాథలుఁ గూడ. కథలమూలమున నాతల్లి సరోజినీ హృదయ క్షేత్రమున నెన్నియో యమూల్యభావబీజములు విత్తెను. రసభరితములైన వైష్ణవగీతములను వరద సుందరి బిడ్డకుఁ బాడి వినిపించెడిది. ఆ మహాకవుల రసోద్రేకము, దీక్షా బుద్ధి, ప్రేమైకజీవనము సరోజినిహృదయము నాక్రమించు కొన్నవి. వరద సుందరి యాగీతములను బాడుచున్నప్పుడు సరోజినీదేవి యేవో లోకాంతరములకు వెళ్లెడిది. ఆ గీత ములు వినుచున్నప్పుడామె కదలదు; మెదలదు. మానిసి రూపులు చెక్కి నిలిపిన జాతిబొమ్మవలె ఆ కన్నులు విస్తృ తములై, నిశ్చలములై యుండెడివి. సుప్తమీనములైన సర స్సులవలె నీ భావములే యామె భవిష్యత్తులోఁ గవయిత్రి యగునని తల్లికి జోస్యము జెప్పినవి. అప్పుడప్పు డేకాంత మునఁ దల్లి పాడెడు వైష్ణవగీతములను సరోజినీదేవి తనలోఁ దాఁ బాడుకొనుచుండెడిది. మాటలైన సరిగారానివయస్సులో నా యుచ్చారణ యావైష్ణవగీతముల నింకను మధుర తరములుగ నొనర్చెడిది. చిన్నపిల్లలు పాడుచున్నప్పు డా యుచ్చారణలోని మాధుర్యము విని యనుభవింపవలసినదే.

చిన్ననాఁటనుండియు సరోజినీదేవికిఁ గులముపై పట్టింపులు పోయినవి. ఆ యింటి వాతావరణమే యట్టిది. ఆమె తోడ నాడుకొనుబాలబాలికలలో నెందఱో ముస్లిము లుండిరి; హిందువులు గూడఁగలరు. వీ రిరువురిలో నామె భేదమును జూచి యెఱుఁగదు. ఆ దినము లోకరీతిగ భయంకర

ములు. హిందువులు ముస్లిములు దీవ్రముగ ద్వేషించు కొనుచున్ననాళు లవి. అక్కడక్కడఁ జెదరుగాఁ గలహ ములు గూడ జరుగుచుండెడివి. వానిలో నెందఱో యమాయకు లసువులు గోల్పోవుచుండిరి. కులమునుబట్టి యొకఁడు దోషియని, ద్వేషియని నిర్ణయించుట చాల యనాగరికమైన దృష్టి. ఈ చీడపురుగు భారతదేశమున కెన్నియోదినము లుగఁ బట్టియున్నది. మన చరిత్రలోని యనేకములైన యనర్థముల కిది మూలము.

సరోజినీదేవి తల్లిదండ్రు లిట్టిభావమును మన్నించు వారు గారు. ఆ సంస్కారమే సరోజినీదేవి కంటివచ్చినది. ఈ యూహలతోనే యామె దన భావిజీతమున హిందూ మహమ్మదీయులకు శాంతిదూతగఁ బనిచేసినది. చిన్ననాఁ డామె యాడుకొనిన యాటలును నంద ఱాడుకొనువానివంటివి గావు. ఆమె యాట లొక చిత్రముగ నుండెడివి. కథలు చెప్పుటలో సరోజిని కాసక్తి మెండు; తనచుట్టును దోడివారిని జేర్చికొనెడిది. ఆమె కథను జెప్ప నారంభించును. ఆ కంఠ ధ్వని తేనె సోనవంటిది. దానినుండి వచ్చు ప్రతిమాటయు నొక నూత్న సంగీతమును గొనివచ్చుచుండెడిది. ఆమె కథల నూరక వల్లించినట్లు చెప్పదు; వాని కనుగుణములైన హావ భావములతోఁగూడ వర్ణించెడిది; నడుమ నడుమ సంభాషణ ములను బొందికగఁ గూర్చెడిది. ఆ చుట్టునున్న నేస్తుల కది యొక దివ్యానందము! వా రామెచుట్టును దామరపూవు

లలో తేకులవలెఁ గూర్చుండెడివారు. నడుమ వెలుఁగొందు నామె యాతేకులలోని కర్ణిక. ఆమె వచించుకథ యాపూవు లందున్న భృంగములు పాడు సంగీతము. కాని, యాశ్చర్య మేమన, ఆ భృంగములు గానవచ్చుట లేదు. అవి యామె కంఠనాళములు. "ఒకరా జుండె"నని యామె యారంభించును. "ఆరాజున కొక రాణియఁట!" ఇంతవఱకే, వినుచున్న శ్రోతలకు శరీరములపై స్పృహయుండుట. ఆ తరువాత వారు శరీరములను మఱతురు. కథయంతయు ముగిసిన పిదప సరోజినీదేవి వారిని దట్టి హెచ్చిరింపవలసిన స్థితి వచ్చెడిది. ఈ యింద్రజాలవిద్య నామె చిన్నతనమునుండియే యభ్యసించినది. రాఁగరాఁగ నీశక్తి యామె జీవితమున నద్భుతకృత్యముల నెఱపెను. ఉపన్యాసవేదికలపై సరోజిని నిలిచినదే చాలు! శ్రోతల కానందసముద్ర ముప్పొంగెడిది. సభ్యులవశులయి బొమ్మలవలె నామె యుపన్యాసమును వినెడివారు. ఆ యుపన్యాసమును విన్నవారెల్ల నా మహాదేవి వాక్చాతుర్యమునకు లోఁబడినవారే! ఆమె తర్కప్రౌఢి యట్టిది. ఆ యుపన్యాసములు చక్కని కవిత్వము. సామాన్య విషయమునకుఁ గవితాశరీరము నొసఁగు రసవాదవిద్య యామెది. ఆమె యీ శక్తితో నీరసములైన రాజకీయ విషయములను రసవత్తరకావ్యగ్రంథములుగఁ జేసెను. ఆమె యుపన్యాసములలో శ్రోతలను రసజగత్తుల నోలలాడించు రసవాదవిద్య యెక్కువ. ఈ శక్తు లామె యెట్లు సంపా

దించెను? చిన్ననాఁట నాకథలు చెప్పుటతోనే! కథలు చెప్పుటలో నాబాలిక శ్రోత లడుగకముందే వారి కన్నులనుబట్టి సందేహముల నూహించెడిది; ఊహించి యుత్తరములఁ జెప్పెడిది. ఈ శక్తియే యామె యుపన్యాసములందుఁగూడఁ గానవచ్చుచుండెను. సరోజిని యుపన్యాసములు సమ్మోహనాస్త్రములు.

సరోజిని పాఠశాలకుఁ బోవుచుండెడిది. కాని, అక్కడి చదువుకంటె నింటిలోనే యామెకు విద్యాభ్యాస మెక్కువగ సాగుచుండెను. పాఠశాలలో నన్నివిషయములయందును "గుణము" లెక్కువగా వచ్చునది యీమెకే. అందుచే నాతరగతిలోని బాలురకెల్ల సరోజినీదేవి యన్న గౌరవముండెడిది. బాల్యదశలో నిట్టి గౌరవము ప్రసిద్ధుఁడైన యాంగ్ల పండితుఁడు జాన్సన్‌కుఁ గూడఁ జెల్లుచుండెడిదఁట! బహుకార్యవ్యగ్రుఁడయినను దండ్రి ప్రతిదినము నింటిలో సరోజినీదేవికిఁ బాఠములు చెప్పెడివాఁడు. గృహమునందు సరియైనశిక్ష లేకున్నచోఁ బిల్లలు చెడిపోవుదురని యాతని భయము. ప్రాఁతపాఠములఁ బ్రతిదిన మడుగుటయు, క్రొత్త పాఠమును బోధించుటయు నాతనికి వాడుక. ఆతనిదృష్టి పూర్తిగ వైజ్ఞానికము. పిల్లల కీపాఠములతో విసుగెత్తెడిదేమో! వారు వెంటనే తల్లికడఁ జేరుదురు. ఆమె యాపాఠములకుఁ గళాస్వరూప మొసఁగెడిది; కథలు చెప్పి వారిని నవ్వించెడిది; గీతములు పాడి యాపిల్లలవిసుగును బోకార్చె

డిది. ముఖ్యముగ నామెకు సరోజినీదేవిపైఁ జూపెక్కువ. నాఁడు దేశమునం దాంగ్లవిద్యాప్రాబల్యము సమగ్రముగ నుండెనని చెప్పితిమి గదా! దానినిఁ జదువుకొన్న నే యా సంఘమున గౌరవము. అఘోరనాథుఁడు గూడ నీ భావము లకుఁ దలవంచినవాఁడే. పైఁగా, ఆతఁడు చదివినదంతయుఁ బరదేశములలోనే కదా! అందుచేఁ దనసంతాన మాంగ్ల విద్యలో గొప్ప పాండిత్యమును సంపాదింపవలెనని యాతని పట్టుదల. అంతమాత్రముతో దేశీయవిద్యల నగౌరవము పఱుపవలెనని యాతని భావముగాదు. కాని, యీ విద్యలు నాఁటి కుబుసుపోకకుఁ జదువవలసినవిగనే యుండెను. ఉద్యో గము మొదలైన గౌరవము లాంగ్లవిద్యాభ్యాసముననే దక్కెడివి. ఈదృష్టితో నాతఁ డాంగ్లమును బాగుగ నేర్వ వలెనని సరోజినీదేవి నాదేశించినాఁడు. మొదట నామె విన్నదిగాదు. మఱల నాతఁ డొకటి రెండుసారు లూఁది చెప్పెను. ఆ మాటలనుగూడ నామె యంతగఁ జెవిని బెట్ట లేదు. తండ్రికిఁ గోపము వచ్చినది. ఒకనాఁ డామె నాతఁ డొకగదిలో నుంచి గొళ్లెము వెట్టెను. "నామాటను వినువఱ కును గొళ్లెముఁ దీయు"నని తండ్రియన్నాఁడు. కొన్నిగంట లిట్లు గడచినవి. ఏకాంతమున నాచిఱుబాలిక యేమేమి యాలో చించికొన్నదో? మఱలఁ దండ్రి వచ్చి గొళ్లెముఁ దీసినాఁడు. ఆమె నవ్వుచు గడ్డకువచ్చెను. ఆముఖముపై ననుత్సాహము లేదు. కన్నులలో నీరు జిఱ్ఱునఁ దిరుగ లేదు. మఱి పెదవిపై

మల్లెపూలవంటినవ్వు విచ్చికొన్నది. ఆమె వెంటనే తండ్రిని సమీపించి నాఁటనుండి యాంగ్లవిద్యను జక్కఁగా సాధింతు నని మాట యిచ్చినది. తండ్రికిఁ గలిగిన యానందమునకు మేరయే లేదు. ఆమె నాతఁ డెత్తికొని తనివిదీఱ ముద్దాడి నాఁడు.

అంతే! మఱుదినము నుండి యామె యాంగ్ల విద్యను సాధించుటకై తీవ్రమైన కృషి చేయ నారంభించెను. ఇంతకు నప్పటి కామె వయస్సు పదియేండ్లు మాత్రమే.

తండ్రి వేసిన శిక్ష కామె నవ్వుచుండెనంటిమి గదా! ఆ దృష్టి యామె కొక గొప్ప వరము. ప్రపంచ మనేక కష్టములతోఁ గూడినది. మానవునకు జయము కన్నను బరాజయము లెక్కువ. కనుక మానవుఁడు హాస్యప్రియత్వము నలవఱచికొననిది బ్రతుకుటయే కష్టము. ఒకవేళ నట్టివాఁడు బ్రదికినను బ్రదుకుగాని బ్రదుకు బ్రదుకును. కొందఱి కీ దృష్టియే యుండదు. వారు హాస్యమును ద్వేషీకరింతురు. నవ్వినచో నది గౌరవమునకు లోపమని వారి దురూహ! నిజమున కట్లుగాదు. బ్రదుకున నున్న కష్టములను మఱచి పోవుటకు మానవునకు భగవంతుఁడు దయచేసిన యమూల్య వరము నవ్వు. కష్టములలోఁ బరాజయములలో దుఃఖము లలోఁ జిఱునవ్వు నవ్వఁగలవాఁడు ధన్యుఁడైన మానవుఁడు. అదృష్టము కొలఁది సరోజినీదేవి కీ గుణము చిన్ననాఁట నుండియే యలవడినది. ఆమె జీవితమున నెన్నియో కష్టము

లనుభవించెను. అనుభవించినపుడెల్ల దానిని దలఁచి నవ్వి నదేకాని దుఃఖించినది లేదు. సరోజినీదేవి దనకుఁ దండ్రి వేసిన యీ శిక్షను బలుమాఱు నవ్వుచు స్మరించికొను చుండెడిది. నాఁ డుప్పు సత్యాగ్రహ ముద్ధృతముగ జరుగు చుండెను. ఈ సంఘటన 1930 వ సంవత్సరము నందలిది. అప్పటి పరిపాలకు లాంగ్లేయులు. వారు జాతీయ నాయకులను వరుసగా బంధింప సాఁగిరి. ఆనాఁ డొక బందీయే నేఁటి మన జవహర్లాలు, భారత దేశ నాయకమణి! పోలీసువారు సరోజినీదేవినిగూడ బంధింప నిశ్చయించుకొన్నారు. ఆమెయు సత్యాగ్రహమునఁ బాల్గొన్నదే కదా! ఆమె 'నరెస్టు' గావించుటకై పోలీసువారు వచ్చిరి. ఆ సన్నివేశమున నామె భయపడలేదు; అనుత్సాహము నందలేదు; ఏదో వేడుకఁ జూడఁ బోవుచున్నట్లు భావించికొన్నది. మిత్రులతోఁ గూడ నామె చిఱునవ్వు నవ్వుచు రక్షకభటుల వెంటఁ బోయెను. ఈ కష్టసహిష్ణుత్వము, దుఃఖములలో సుఖమును జూచు చూపు నామె చిన్నఁదనమున నేర్చికొన్న గుణములే.

తండ్రి సరోజినీదేవిని హైస్కూలులోఁ జేర్ప నెంచెను. నాఁడు హైదరాబాదులో మంచి పాఠశాల లున్నట్లు లేదు. పైఁగా నాతని కాంగ్లభాషపై నెక్కువ మక్కువ యని ముందే చెప్పితిమి గదా! చిఱుతవయస్సులో నున్న సరోజినీ దేవితో నాతఁ డాంగ్లమునందే సంభాషించెడివాఁడు.

తండ్రితోఁ దప్ప తక్కినవారితో సరోజిని బెంగాలీ, లేక, హిందూస్థానీ భాషలలోఁ బ్రసంగించెడిది. మద్రాసునందు మంచిహైస్కూళ్లుండెడివి. మద్రాసు పాఠశాలలలో నాంగ్లభాష బాగుగ నేర్పుదురను ప్రథ-నాఁడేకాదు - నేఁటికిని గూడఁ గలదు. అందుకై యాతఁడామెను మద్రాసునకుఁ బంప నిశ్చయించికొన్నాఁడు. ఈ విషయముఁ దలఁచికొన్నంతనే యాతని నెదిరించిన వనేక సమస్యలు. వీనిలో మొదటిది నాఁటి సామాజిక దృష్టి.

గత శతాబ్దము నందు స్త్రీల కింకను నింత స్వాతంత్ర్యము మనవా రొసఁగినది లేదు. నేఁటికిని గూడఁ దక్కువే కదా! పూర్వుల దృష్టిలో స్త్రీ యనున దొకయచేతనమైన పదార్థముతో సమానము. వారికిఁ బ్రత్యేకమైన మనస్సుగాని, కష్ట సుఖములు గాని యున్నట్లు గమనించి యా పురుషులు వారి యెడల నట్లు ప్రవర్తించుటయే లేదు. వారి దృష్టిలో స్త్రీలు వంటయింటి కుందేళ్ళు. వంటయిల్లు దాఁటి గడ్డకు వచ్చుటకు వారి కధికారము లేదు. ఇల్లు దాఁటి యేమాత్రము ప్రజోపయోగకార్యములకైనను సరే బయటఁ దిరిగిరా, వారిని జెడినవారిక్రింద సమాజము జమకట్టుచుండెను. స్త్రీలకు విద్యాభ్యాసము పనికిరాదను నొక వింత వాదముగూడ నాఁటి జనులలో బాగుగఁ బ్రాఁకియుండినది. ఇట్టి చాదస్తముల నన్నిటిని యానాఁటి పెద్దలు పూర్వాచారములని సమర్థింపఁ బూనుకొనుచుండిరి.

నిజమున కివి ప్రాచీనములైన యాచారములు గావు.

మన సమాజముపై నవనాగరికు లొనర్చు విమర్శనము లనేక మున్నవి. వానిలో నీ స్త్రీల విషయముగూడ నొకటి. భారతీయులు స్త్రీలను జాల యుపేక్షించిరని వారందురు. ఇది గొంతవఱకు సత్యమే! ఈ విమర్శనము మొన్న మొన్నటి సనాతనుల మనుకొనువారిని జూచియే యారంభింపఁబడినది. కాని, యంతకు ముందున్న జనులు స్త్రీల నంతగా నుపేక్షించినవారు గారు. ఇతిహాసకాలమున స్త్రీలలో నెందఱో గొప్పగొప్పవా రున్నట్లు మనకుఁ దెలియును. కవయిత్రులేకాక కత్తిపట్టి యుద్ధముచేసిన స్త్రీలు గూడ నున్నారు. గద్దె నెక్కి రాచరిక మొనర్చిన స్త్రీలు గలరు. రుద్రమదేవి యట్టి మహారాజ్ఞి. ఆమె పేరన్న శత్రువులగుండెలు దల్లడిల్లుచుండెడివి. ఝాన్సీలక్ష్మీబాయి, చాంద్ బీబీ, మొదలైన వీరనారీమణులు చూపిన పరాక్రమము చరిత్రకే యొక యలంకారము. ఇఁకఁ గవయిత్రులకు లెక్కలేదు. సంస్కృతమునందుఁ బేరు ప్రతిష్ఠ లార్జించిన కవయిత్రు లెందఱోయున్నారు. గంగాదేవి, విజ్జిక మొదలైన స్త్రీలు వ్రాసిన కవిత్వములు గవితాగుణములం దితరరచనల కేమాత్రమును దీసిపోయినవి గావు. ప్రాకృతభాషలలో ననేకులు కవయిత్రులు గలరు. హాలుఁడను శాతవాహనరాజొకఁ డుండెను. అతఁడు గాథాసప్తశతి యను నొక గ్రంథమును సంకలన మొనర్చెను. తనకు సమకాలికులైన కవులు

వ్రాసిన చాటువులలో రసభరితములైన వానిని హాలరాజు దనసంపుటిలోఁ జేర్చికొన్నాఁడు. ఆ చాటువులలో ననేకము స్త్రీలు వ్రాసినవే! దేశభాషలలో నెందఱో స్త్రీలు కవిత్వము లల్లిరి. మొల్ల రచించిన రామాయణము తెనుఁగున విఖ్యాతమైనది. తరిగొండ వెంకమ్మ, ముద్దుపళని, కృష్ణరాయల బిడ్డ మోహనాంగి యాంధ్రసాహిత్యాకాశమున జిగజిగలాడు చుక్కలవంటివారు. సంస్కృతమునఁ గవిత్వము వ్రాసినవా రింకనుఁ జాలమంది యున్నారు. విజయనగర సామ్రాజ్యకాలమునఁ గవయిత్రు లెక్కువ. స్త్రీలు మల్లయుద్ధములయందును బాల్గొనెడివారఁట; ధనుస్సులను ధరించి బాణప్రయోగము లొనర్చెడివారు. వారి కేవిద్య రాదు? ఎందులో వారు దక్కువ? ఎందునను దక్కువగారు. వేదకాలమున స్త్రీలలో బ్రహ్మనిష్ఠను బట్టినవారు పలువురు. జనకమహారా జేర్పఱచెడిసభలలో గార్గి బ్రహ్మవిద్యను గుఱించి వాదించినదిట్టు. మఱి స్త్రీలవిషయమున నీ యనాదర మెప్పు డేర్పడినది? మన సమాజము పతితమైన తరువాత; పరదేశీయులపాలనమునకు మనవారు దమ స్వభావ సంస్కృతులను బలివెట్టిన తర్వాత.

అఘోరనాథుఁడు సరోజినీదేవిని విద్యకొఱకై మదరాసున కంపుచున్నాఁ డన్నవార్త నవనవగా వ్యాపించెను. కొంద ఱీవిషయమై గుసగుస లాడికొనఁజొచ్చిరి. వీరందఱును సనాతనాచారపరులమని మురిసెయువారు; కూపస్థమండూక

ములు. అఘోరనాథుఁ డీగుసగుసలను లెక్కపెట్టలేదు. విమర్శనము లొనర్చువ్యక్తుల వ్యక్తిత్వము నాతఁడు బాగుగ నెఱుఁగును. ఇఁక నాతని నెదిరించిన రెండవ సమస్య యిది: సరోజిని చాల చిన్నది. ఈమె నొంటిగ మదరాసులో వదలుట దల్లిదండ్రులకుఁ గష్టముగా నుండెను. సరోజినీదేవి కపుడపుడే పదవయేఁడు గడచుచున్నది. ఇంత చిన్న వయసులో నామె దల్లిదండ్రులనువదలి యె ట్లుండఁగలదు? వరదసుందరీదేవికిని బిడ్డను వదలియుండుట గష్టమనిపించెను. కాని, యా పితరు లాభావమును దమించికొన్నారు. బిడ్డయొక్క భవిష్యత్తు వారికిఁ బ్రధానముగఁ దోఁచెను. అందుకై మాతృదేవియైన వరదసుందరి దన హృదయమును రాయిఁ జేసికొనెను.

ఇఁక మూఁడవసమస్య యార్థికమైనది. మదరాసులో బిడ్డను జదివింపవలెనన్నచో నాకాలమున నెక్కువ ధనవ్యయము. హైదరాబాదులో సంసారమును బోషించికొనుచు సరోజినీదేవిని మదరాసునఁ జదివించుటలోఁ గుటుంబమునకుఁ గొన్ని కష్టము లుండెను. కాని, యఘోరనాథుఁడు దానికిఁ దయారైనాఁడు. అనవసరములైన ఖర్చుల నింటిలో నాతఁడు తగ్గించివేసెను. సరోజినీదేవి మదరాసునకుఁ బ్రయాణము గట్టినది. ఆమె మెట్రిక్యులేషను పరీక్షకుఁ జదివెను. మదరాసులో రేవగ లామె విద్యావ్యాసంగముతోనే కడపినది. సరోజినీదేవి యాపరీక్షయం దుత్తీర్ణురా

లయ్యెను. కేవల ముత్తీర్ణురాలగుటయే కాదు; ప్రతివిషయమున నామె యెక్కువ 'గుణము'లను సంపాదించికొనెను. మదరాసు కోస్తాలో నన్ని 'గుణము'లతో నెగ్గినవారు విద్యార్థులలో మఱియెవ్వరు లేరంట! నాఁటి పరీక్షలు నేఁటి పరీక్షలవంటివి గావు. విద్యార్థుల కాంగ్లభాష నేఁటికంటె నెంతో రావలసియుండెను. గణితము, చరిత్ర, భూగోళము మొదలైన విషయము లెన్నియో నాఁటి విద్యార్థుల కవశ్య పఠనీయములు. ఏవిషయమున నొక 'గుణము' తక్కువగ వచ్చినను 'పోనీలె'మ్మని పైకిఁద్రోయు నాచార మాకాలమున నసాధ్యము. నాఁటి మెట్రిక్యులేషను పరీక్షా ప్రశ్న పత్రములు నేఁటి బి. ఏ. విద్యార్థులకుఁ గూడఁ గష్టముగ నుండును. సంవత్సరమునకు రెండుపరీక్ష లానాఁడు లేవు. ఇట్టి దుర్గమమైన పరీక్షలో నామె యంత చిన్నవయస్సులోఁ గడతేఱుట, కోస్తాలోఁ బ్రథమురాలుగ లెక్కింపఁబడుట యాశ్చర్యకరములైన విషయములు. అద్భుతమైన యీ విజయముల కామె నిరంతరపరిశ్రమయే కారణము. పరీక్షలైనవెంటనే సరోజిని హైదరాబాదునకు వచ్చినది. అప్పటి కామె వయస్సు 12 సంవత్సరములు.

సరోజినిదేవి మొదటినుండియుఁ గొంత బలహీనురాలు. ఆమె శరీరము తీవ్రవ్యాసంగమున కోర్చెడిది గాదు. కాని, యామె లెక్కింపలేదు. మద్రాసునందున్నప్పుడు ప్రతిదినమును సరోజినీదేవి విద్యావ్యాసంగమునకే వినియో

గించెడిది. ఈ తీవ్రపరిశ్రమచే నామె శరీరము డస్సి పోయినది. ఊరికి వచ్చిన వెంటనే యనారోగ్య మామెను బైకొనెను. ఆ జబ్బు సరోజినీదేవిని నాలుగు సంవత్సరములు వదలలేదు. తండ్రి యామెను కళాశాలలోఁ జేర్పవలెనని యెంతయో యుత్సాహపడెను. ఆతని యా సంతోషమంతయు భగ్నమైనది. ఆమె పూర్తిగ విశ్రాంతి గైకొనవలెనని వైద్యులు సలహా యొసఁగిరి. పుస్తకములు గూడఁ జదువ రాదని వారి శాసనము. దీనితో సరోజినిదేవియు మానసిక ముగఁ గొంత బాధపడెను. "చదువు మఱలఁ జదువుకొన వచ్చును గాని శరీరారోగ్యమును గాపాడుకొను"మని వరద సుందరీదేవి హెచ్చరించినది.

నాలుగు సంవత్సరములు సరోజినీదేవి యింటియందే యుండెను. ఒక రీతిగఁ జూచినచో నీ వర్షము లామె జీవిత మున నెంతయో వెలగలవి. ఈ కాలమున నామె గొప్ప లోకానుభవమును సంపాదించినది. ప్రతి విషయమున నామె దృష్టి చాల సూక్ష్మమైనది. ప్రతి దినమును వారి యింటికి వచ్చు బంధువులకు, మిత్రులకు లెక్కలేదని చెప్పితిమి గదా! వా రందఱితో సరోజిని యుత్సాహముతో సంభా షించెడిది. ఆ సంభాషణములలో నెన్నియో చర్చలు వచ్చు చుండెను. ఏ విషయమునైన నామె యొకసారి విన్నచో మఱల జీవితమున మఱచెడిది గాదు. విభిన్న మానవ ప్రవృత్తులు, అభిరుచులు, వాని గుణదోషములు నామె చక్కఁగా

గ్రహించుచుండెను.

వైద్యు లెంత వలదన్నను సరోజిని యీ దినములలో వ్యాసంగము నొనర్పక మానలేదు; ఉబుసుపోకకై యేవేవో గ్రంథములు చదువు చుండెడిది; ఆంగ్ల మహాకవుల రచన లన్నియు నామె యీ నాల్గు సంవత్సరములలోఁ ద్రిప్పివేసెను. ఆమె నోట వల్లించిన యాంగ్లపద్యములకు లెక్కలేదు. ఏ కవి పేరు చర్చకు వచ్చినను సరే అతని రచనలోఁ గొన్ని యనర్ఘములైన భాగముల నామె గబగబ చెప్పివేసెడిది. షేక్స్పియరు మహాకవి రచించిన నాటకము లామె కాశ్చ ర్యమును గలిగించెడివి. ఆ మహా కవి మానవ చిత్తవృత్తుల నెంత బాగుగఁ జిత్రించును! ప్రపంచము నాతఁ డెన్ని కోణ ములనుండి గమనించినాఁడు! అతఁడు సృష్టించిన నాయికలలో ఒక్కొక్కతె యొక్కొక్క సౌందర్య ద్వీపము. ఇఁక నాతని నాయకులు! వారు మహోజ్జ్వలులు; ఆవేశ పురుషులు. ప్రతి హింసా భావముతోఁ బిచ్చివాఁడైన హామ్లెట్ కల్పితమైన యపవాదమును నమ్మి సత్యాసత్యములు విచారింపక నెత్తి పోకలు పోయిన ఒథెల్లో, అధికార దర్పము కన్నుగప్పి తాను దైవాంశ సంభూతుఁడనని నమ్మి చెడిపోయిన సీజరు, దేశభక్తి యను మత్తెక్కించిన కృతకమిత్రుల మాటలకు లోఁబడి సీజరును వధించిన బ్రూటస్సు, రోమియో-జూలి యటుల ప్రణయగాథ, మిరాండా వలపు-ఇవి యన్నియు నామె చిఱుతమనస్సున గాఢముగఁ జిత్రితములై పోయినవి. వర్డ్స్ వర్తు మహాకవి ప్రకృతికిఁ బూజారి. అతని భక్తి

కాామె సంతోష పడినది. మిల్టన్ సముద్ర గంభీరుఁడు. అతని గాంభీర్య మామెకు సమ్మతమైనను, జీవితమున నగ వెలుఁగని యాతని రచన సరోజినీదేవికి భయము గల్గించెను. హోమర్ మహాకవి నామె యెన్నియోసారులు చదివెను. వీరందఱికంటె నామె నాకర్షించినది లలిత హృదయులైన కీట్సు, షెల్లీ మొదలగు వారు. వారి హృదయ లాలిత్యమున నామె నందనవనమును దర్శించెను. ఆ కవితా కానన ములలో సరోజినీదేవి విశృంఖలసంచార మొనర్చెను. ఆంగ్ల సాహిత్యమున కలంకారములైన గద్య రచనల నామె చదివెను. ఓహో! ఒక్కొక్కని కొక్కొక్క ప్రతిభ. వారి మేధా సంపత్తి కామె చకితురాలైనది. ఆమె నోరు దెఱచి పలికినఁ జాలును, ఎందఱో మహాకవులు దూఁకి వచ్చుచుండిరి. చిఱుత వయస్సులో నున్న సరోజిని మేధా సంపత్తిని జీర్ణించుకొనుటకుఁ బెద్దవారికే యసాధ్యమయ్యెను.

కవితారచన సరోజినికి బాల్యము నుండియే యలవాటయ్యెను. అది వరదసుందరీదేవి యొసఁగిన భిక్ష. ఈ నాల్గు వర్షములలో సరోజినీదేవి యెన్నియో కవితలు రచించెను. ఆమె యొక కావ్యము వ్రాసెనఁట! అది వేయి పంక్తులుండెను. ఇన్ని పంక్తుల నామె యెనిమిది దినములలో వ్రాసెనఁట! కవిత్వ మామె యూర్పు. జన్మతో నామె రచయిత్రి. అందుకే యామె నితర దేశీయులు "భారతోద్యాన కలకంఠ" మని పొగడిరి. కోకిల గానమును నేర్చికొనునా? జన్మతో దానికి గానము సిద్ధించునుగదా!

# 3. భావసంధి - పరిష్కారము

నాల్గుసంవత్సరములు విద్యావ్యాసంగముతోఁ గడ చెను. అపు డామె యొనర్చినది వ్యాసంగ మొక్కటిమాత్రమే కాదు; వ్యాసంగమునకు లక్ష్యములైన మానవప్రవృత్తులను గూడ నామె గ్రహించెనంటిమి. పుస్తకములతో విసుగెత్తి నపు డామె మిత్రులతో సంభాషించును; సంభాషించుట చాలనిపించినపుడు పుస్తకప్రపంచమున విలీనయైపోవును —ధ్యానమునందు నిమగ్నయైపోయిన యోగినివలె.

అది 1885–వ సంవత్సరము. ఆసంవత్సరమున హఠాత్తుగ నామె జీవితమున నొకమార్పు గలిగెను. కొన్ని సన్ని వేశములు జీవితములలో నట్లు జరుగును. వానికిఁ గారణ కార్యభావ ముండదు. కాని, యేదో తర్కమును గల్పించి కొని తృప్తిపడుట మానవుని స్వభావము. అందుకై కారణ మిది యది యని మనమై సృష్టించికొందుము. వాస్తవమున కది కారణమును గాదు. మఱి కారణము ప్రాచీన జన్మ సంస్కారములకు సంబంధించినది. దానికిఁ గారణ మీ జన్మమున నుండదన్నమాట! అట్టి సన్నివేశ మొక్కటి సరోజినీదేవి జీవితమునఁ దటస్థపడినది.

అది యొకనాఁటి ప్రాతఃకాలము. అఘోరనాథుఁ డొక గదిలోఁ గూర్చుండి యేమో వ్రాసికొనుచుండెను. ఆ గదిలో నున్నపుడే యాతఁడు మిత్రులతో సంభాషించును. వ్రాఁతయం దఘోరనాథుఁడు పూర్తిగా నిమగ్నుఁడై నాఁడు.

ఇంతలో నా గదిలోని కొక వ్యక్తి వచ్చెను. అతఁడు వచ్చినదికూడ యఘోరనాథుఁడు రెండు నిమిషములు గమనింపనేలేదు. అతఁడు హఠాత్తుగఁ దలనెత్తెను. ఎదుట గోవిందరాజులునాయుఁడు నిలువఁబడియుండెను. అతఁడు హైదరాబాదులో నొక ప్రసిద్ధుఁడైన వైద్యుఁడు. వెంటనే యఘోరనాథుఁ డిట్లన్నాఁడు:

"మీరు వచ్చి యెంతసేపైనదో? క్షమింపుఁడు; గమనింపనే లేదు."

నాయుఁడు చిఱునవ్వుతో బదులిచ్చెను:

"మించిపోయిన దేమియును లేదు. తమ రేదో నిమగ్నులై వ్రాసికొనుచుండుటచే విఘ్నమొనర్చు టెందుకని నిలిచియుంటి నంతే."

అఘోరనాథుని చిఱునవ్వ నాయుఁడుగారి నవ్వునకు బదులిచ్చెను. అది సభ్యత. అతఁ డన్నాఁడు:

"మంచిపని చేసితిరి. తమ రీ యాసనముపైఁ గూర్చుండుఁడు." అఘోరనాథుఁ డెదుటనున్న యొక కుర్చీని జూపించెను. డాక్టరు ఆ యాసనముపైఁ గూర్చుండలేదు. అతని వాలకము చూడఁగా నేదో సంభాషింపవచ్చిన ట్లున్నది. కాని, తా నొనర్పఁబోవు సంభాషణము ఛటోపాధ్యాయునికి సమ్మతముగ నుండునో లేదో యనుసందేహము మొగముపై గోచరించుచుండెను. అయినను దానిని వెంటనే చెప్పివేయవలయు నను నిశ్చయము

గూడఁ గానుపించుచుండెను. ఈ రెండుభావము లాముఖ ముపైఁ బెనఁగులాడుచున్నవి. అందుకే యా భ్రూవిక్షేపము. అఘోరనాథున కీ వాలక మర్థముగాలేదు. అతఁడన్నాఁడు:

"మీ రెన్నఁడింతకు ముందు ప్రాతఃకాలమున వచ్చినది లేదు. అందులో, నింత త్వరగ వచ్చుట యాశ్చర్యమే! మీ రేదోసంభాషింప వచ్చినట్లున్నది. మఱి, దానికి జంకెందుకు? ఎట్లైనను మొదట నీయాసనముపైఁ గూర్చుండుఁడు."

డాక్టరు జంకుచునే కూర్చున్నాఁడు. రెండు నిమేషములు మౌనముగనే కడచెను. అఘోరనాథుని మనస్సు ద్విధా విభక్తమైయున్నది. తాను వ్రాసికొనుచున్న విషయముపై నాతనిమనస్సొకవైపు కేంద్రీకరింపఁ బడియుండెను. ఇంటికి వచ్చిన పెద్ద మనుష్యునియెడ నగౌరవము గనుపఱుపరా దనునొకభావముఁ గూడ వేఱొకవైపున్నది. ఈ రెంటితో నాతఁడు సదమదమగుచు నిట్లన్నాఁడు:

"నాయుఁడుగారూ! మీ వాలకము నేఁడేమో వింతగా నున్నది. మీ రేమో సంభాషింపవచ్చితిరి. మఱి, దానిని మనస్సులోనే యేల నిల్పికొందురు? నా విషయమున మీకు జంకేల? నేను క్రొత్తవాఁడనుగానే!"

నాయుఁడుగారి కిఁకఁ బలుకక విధిలేక పోయినది. వా రన్నారు: "నేను మీతో సంభాషింపనే వచ్చితిని. ఒక కోరికను దెల్పికొనుటకై వచ్చినాను. ఆకోరిక విచిత్రమైనది. అందుకే మాటలు బయటికి వచ్చుట లేదు."

అఘోరనాథుఁడు పకపక నవ్వెను. ఆతఁ డెప్పుడును నిండుగా నవ్వును. అతఁ డిట్లు వచించెను:

"చాల సంతోషము. మీకోరికను మన్నించుట నాకు శక్యమైనచో నవశ్య మొనర్తును. దానికి మీరు సంకోచింప నవసర మేమున్నది? ఏదీ యా కోరిక; అరేబియన్ నైట్సు కథలలోవంటి కోరికయేమో ? వినదముగాక ! వచింపుఁడు."

నాయుఁడు పీల్లు నమలుచు నారంభించినాఁడు. హఠాత్తుగ నాతని నోటినుంచి "మీపుత్రిక సరోజినీదేవిని వివాహమాడవలెనని నాకు మనసున్నది," యనుమాట వెలువడెను. అంతే!!

నాయుఁడుగారి శరీరమంతయు నొక్కపెట్టునఁ గంపింపఁ దొడఁగెను——గాలికిఁ జిగురాకువలె.

ఆతని మనస్సున నావరించిన భావములు గంపెఁడు. వెంటనే యఘోరనాథుని ముఖము మాఱెను. ఆ మొగము దొలుతఁ గొంత వెల్లఁబాఱెను. వెంటనే యాకళాహీనత నాతఁడు దమించెను. అఘోరనాథుఁ "డేమీ!" యన్నాఁడు. ఆమాటతోనే యాతనిముఖ మెఱ్ఱవారినది.

అఘోరనాథునికిఁ గోపము వచ్చిన దన్నసంగతిని నాయుఁడు గ్రహించెను. కాని, యిప్పుడు చింతించి యేమి లాభము? మాటలు జాఱిపోయినవి! అతఁడు నిశ్శబ్దముగ ఘటోపాధ్యాయులను గమనించుచున్నాఁడు.

అఘోరనాథుఁ డేమియుఁ బలుకలేదు. ఎన్ని భావములతోనో యాతఁడు మథనపడినాఁడు. వాని పోకలన్నియు నాతని ముఖముపై స్పష్టముగఁ గనుపడుచుండెను. స్వభావముగ నఘోరనాథుఁడు శాంతుఁడు; మనోభావముల దమించికొను నలవాటు గలవాఁడు. కాని, హఠాత్తుగ, నాతని హృదయము తాడితమైనది. దానితో భావవికారమును దమించికొనుశక్తిగూడ నాతనికి లోపించినది. రెండు నిమిషములట్లు గడచినవి. కడ కాతఁ డిట్లనెను :

"సరోజినీదేవి కీ విషయము దెలియునా? ఇంతకుముందే మీ రామెతో సంభాషించినారా?"

అఘోరనాథుని చూపులు తీక్ష్ణములై యుండెను. ఆ యొక్కొక్క చూపును గుండుసూది వలెఁ దన్నుఁ బొడుచు నేమో యన్న భయము నాయుఁడుగారి నావరించినది.

"లేదు. నేనంత పనికిఁ బూనుకొనలేదు. ఇది సత్యము" అని నాయుఁడు జంకుచు బదులిచ్చెను.

ఈ యుత్తరముతో నఘోరనాథుఁ డేదో బరువు దించికొన్నట్లు కానవచ్చెను. ఆ ముఖము గొంత కళ గట్టినది. ఆ యవకాశమును బురస్కరించికొని నాయుఁ డనెను :

"నా కామెపై మనసున్నది నిజము. కాని, యంతమాత్రమున నామెతో మీ కెఱుక లేక యేకాంతముగ సంభాషించునంతటి యనౌచిత్యమును నే నొనర్పను; అది మన భారతదేశ సంప్రదాయము గాదని నే నెఱుఁగుదును."

అఘోరనాథుఁడు గొంత శాంతుఁడయ్యెను. ఆతఁడు తిన్నగా బదులు వల్క నారంభించెను :

"నాయుఁడు గారూ! మీ మనోరథమునకు నేను సంతసింపలేను. మేము బ్రాహ్మణుల మనుట మీకుఁ దెలియును. అంతమాత్రమే కాదు. మా వంశము వైదిక సంప్రదాయ బద్ధమైనది. తర తరములనుండి మా పెద్దలు వేదములఁ జదివిరి; ఇతరులచేఁ జదివించిరి. నేనాంగ్ల విద్య నభ్యసించియుండవచ్చును. సీమకేఁగి యుండవచ్చును. కాని, యంతమాత్రముతో మా పెద్దలపై, వారి యాచారములపై నాకు గౌరవము తగ్గలేదు. ఇతరుల యభిప్రాయములకు నేను వెల లివ్వనని తమకుఁ దెలియును. నాకు సమ్మతమైనప్పుడు, యితరు లేమను కొన్నను సరే, ఆ పని చేయుట నాకు వాడుక. అందుకే యామెను మదరాసునఁ జదివించుటకు సాహసించితిని. అపుడు సనాతనులు నాపై నెన్నియో యభాండముల నెత్తిరి. కాని, మీరడిగిన విషయము నాకే సమ్మతమైనది గాదు. ఇంత మాత్రముతో మీ వ్యక్తిత్వమును నే నగౌరవించుచున్నానని తలఁపకుఁడు. మీ విద్యపై, గుణములపై నాకు గౌరవమున్నది. తమ రెప్పుడు మా యింటి కరుదెంచినను మిమ్ము గౌరవించుటకు నేను సంసిద్ధుఁడను. కాని, మీ యీ కోరికను మాత్రము దీర్పలేను."

ఈమాట లనుచు నే యఘోరనాథుఁ డాసనమునుండి

లేచెను.

ఆలేచుట 'యిఁక మీరు పోయిరావచ్చు' ననుటకు సంకేతము. నాయుఁడుగారును గుర్చీనుండి లేచినారు. ఇరువురును గరచాలన మొనర్చికొనిరి. ఆకరచాలనమున సంతోషము లేదు. అది వాసనలేని పూవువలె సౌందర్యహీనమై యుండెను. ఇరువురి ముఖములును బైకిఁ గన్పించరాదని యెంత యణఁచికొనుచున్నను మ్లానముగనే యున్నవి. నాయుఁడుగారు నిష్క్రమించిరి.

నాయుఁడు నిష్క్రమించినదే యఘోరనాథుఁడు గృహములోనికేఁగెను. ఆతని కిఁక త్రాఁత దోఁచినది గాదు. అతఁడు వరదసుందరీదేవిని సమీపించినాఁడు. భర్త పిలిచినదేతడ వామె యాతని దగ్గఱకు వచ్చినది. అఘోరనాథుఁడు సంభాషణ మారంభించినాఁడు:

"గోవిందరాజులునాయుఁడుగారింతకు ముందు నాకడకు వచ్చియుండిరి."

"నాకుఁ దెలియును."

"నీ కెట్లు తెలిసెను?"

"అతఁడు వచ్చుచుండగాఁ జూచితిని."

"అతఁ డేమనెనో తెలియునా?"

"నాకుఁ దెలియదు. కాని, నే నూహింపఁగలను."

అఘోరనాథున కేమియు నర్థము గా లేదు. తనకు నాతనికి నడుమ జరగిన సంభాషణ నామె యెట్లూహింపఁ

గలదు?

"అయిన నూహించి చెప్పుము చూతము!" అని అఘోరనాథుఁడు వచించెను.

"సరోజినీదేవి పెండ్లివిషయమై యాతఁడు ప్రస్తావించియుండును," అని వరదసుందరీదేవి నవ్వుట కారంభించినది.

అఘోరనాథున కీసన్నివేశ మర్థముగాలేదు. అతని పాలి కది యొక యింద్రజాలముగ భాసించెను.

" ఈవిషయము నీ కెట్లు తెలియును?" అని యతఁడన్నాఁడు.

"మగవారికిఁ దెలియని కొన్నిభావములు స్త్రీ లతిత్వరితముగ గ్రహింతురు," అని వరదసుందరి మఱల నవ్వెను.

అఘోరనాథునికి దిక్కుదోఁచినది గాదు.

"సుందరీ! నన్నేల సిలుగులఁ బెట్టెదవు? జరగినదేమో స్పష్టముగఁ జెప్పుము," అని ఆత డనెను.

వరదసుందరి యారంభించినది: "చెప్పుట కేమున్నది? నేను గొన్ని దినములనుండి యాతని వాలకము గమనించుచునేయున్నాను. మన సరోజినిని జూచినదేతడవు గోవిందరాజులముఖము వికసించును. అతఁ డామెతో భాషించునపు డేదో యొక యుత్సాహమును బూనును. ఆమె యెవ్వరితో మాటలాడుచున్నను జెవియొగ్గి వినును. మన సరోజినీదేవి

వచించు ప్రతిమాటయు నాతనిపాలి కేదో సంగీతమై భాసిం చును. ఇవన్నియుఁ బ్రేమ చిహ్నములు. ఇవి కనితో ప్రపంచ మున వచ్చెను. మన సరోజిని పలుకులు సంగీతమైయున్న దాతని కొక్కనికే కాదు; నాకుఁగూడ; నావంటివారు మఱి కొందఱికిని.'' అఘోరనాథుఁడు నవ్వుచున్నాఁడు. వరద సుందరి యింకఁ గొంచెము గట్టిగా నవ్వినది :

''నేను జెప్పిన దదే. మీ సంగీతము వేఱు. అతనికిఁ దోఁచు సంగీతము వేఱు. ఆ సంగీతమునకు వెనుక గొన్ని భావము లున్నవి. ఆ భావములతో నా యొక్కటే సంగీ తము భిన్నభిన్నవ్యక్తులకు విభిన్నములైన యానందమును గల్గించును. మీకు బిడ్డపై నున్నది వాత్సల్యము. అందుచే నామె పలుకులు మీ కర్థమగు రీతి వేఱు. వానితో మీ రను భవించు నానందము వేఱు. గోవిందరాజుల కామెపైఁ బ్రేమ యున్నది. ఆమె పల్కులలో నాతనికిఁ దోఁచు సంగీ తము వేఱు. అతఁ డనుభవించురీతులు వేఱు. అందుకే యాలంకారికులు సన్నివేశ మొక్కటేయైనను భిన్నభిన్న వృత్తులు విభిన్నముగ భాసించునందురు.''

''ఈ నడుమ నీ వెక్కువగఁ జదువుకొనుచున్న ట్లున్నది. వంటయింటిపనులు గట్టిపెట్టితివా యేమి?'' అని ఘటోపాధ్యాయుఁడు మఱలఁ బక్కున నవ్వెను. వరదసుందరి యందికొన్నది :

''నాచదువు పనుల కేమియు నడ్డురాదు. మీ చదు

వులు పుస్తకములలో; నా పుస్తకము హృదయమే!"

"మఱి సరోజిని హృదయము నాయుఁడుగారిపై నెట్లున్నది? ఆమె విషయమునుగూడ గమనించితివా లేదా?"

"గమనింపకేమి? మీరనుకొన్నదానికంటె బాగుగనే గమనించినాను."

"ఆమె తలఁపు లెట్లో?"

"ఏమున్నది? సరోజిని కది సమ్మతమే."

ఈమాటతో నాతని హృదయము నెవరో బలముగఁ గొట్టినట్లాయినది. అఘోరనాథుఁ డదరిపడినాఁడు. అతని కామెతో నేమి పల్కుటకును దోఁచినదిగాదు. మఱల నాతఁడు వితర్కములోఁ బడెను. గోవిందరాజుల నింటికి రానిచ్చినది దోషమనుకొన్నాఁడు.

వరదసుందరి యాతని బాధను గమనింపకపోలేదు. ఆమె యన్నది: "దీనికి మం దొక్కటే! ఆతని సహవాసము నుండి సరోజినిని దప్పింపవలెను."

"ఎట్లు తప్పించుటని! నాయుఁడుగారి నింటికి రావల దందమా? దానికి సమయము మించిపోయినది. సరోజిని నతనితో మాటలాడవల దందమా? నా కది యంత యుక్తముగఁ దోఁపలేదు," అని ఘటోపాధ్యాయుఁ డన్నాఁడు.

"ఎందుకు? ఆమెను మఱల మదరాసునకుఁ బంపి వేయుదము. చదువు సాఁగును; ఇతని సహవాసమును దొలఁగిపోవును."

అఘోరనాథుఁ డామె మాటలు విన్నట్లే లేదు. అతఁ డేదో తీవ్రముగ నాలోచించికొనుచుండెను.

ఇంతలో నొక బంట్రోతు వచ్చి పత్రమొకటి యొసఁగెను. దానిని వ్రాసినవారు - నిజాము. ఏదో మాటలాడ వలసియున్నదనియు, వెంటనే రావలసినదనియు నాపత్రమందున్నది. ఈపత్ర మాతని కొకరీతిగ సంతోషమునే కల్గించెను. కొంతసేపు మానసిక విచారములనుండి యిది విడుమర.

అఘోరనాథుఁడు వెంటనే రాచనగరున కేఁగి నిజామును దర్శించెను. వా రిరువ్వురు గొంతసే పామాట లీమాటలు సంభాషించి కొనిరి. తరువాత నిజా మిట్లనెను:

"మీ పుత్రిక రచించిన యాంగ్ల పద్యములు గొన్ని నిన్ననే యొక పత్రికలోఁ జూచితిని. నా కా పద్యములు చదువఁ జాల సంతోషమైనది. దానిని బ్రకటించుటకే మిమ్ముఁ బిల్వనంపితిని. ఆ పద్యములు చాల బాగుగనున్నవి. ఆమె యిచటనే యున్నదా?"

"అవును! అమె నా యొద్దనే యున్నది," అని అఘోరనాథుఁడు బదులిచ్చెను.

"ఆమె యిపు డేమిసేయుచున్నది?"

"ఊరకయే యున్నది. మదరాసునకు సంబంధించిన మెట్రిక్యులేషను పరీక్షలోఁ గడ తేఱినది; అందఱిలోఁ బ్రథమురాలుగ గణింపఁబడినది. కాని, ఆమెను గళాశాల కంప

లేదు.''

''ఎందుకు? మీరొనర్చినపని యంత బాగుగ లేదు. ఆమె సంస్కారమును మీరు నలిపివేయుచున్నారు. ఆమెను సీమకుఁ బంపుఁడు. నేనామె కుపకారవేతన మొసఁగుదును. నాకామెకు సాయ మొనర్పవలెనను బుద్ధి వొడముచున్నది.''

అఘోరనాథున కెంతయో సంతోషమయ్యెను. తానింతకుముందు బాధపడుచున్న సమస్యల నీ ప్రయాణ మొకరీతిగఁ బరిష్కరించును. ''అట్లే యొనర్తును'' అని యాతఁడు సెలవుగైకొని యింటి మొగము వట్టినాఁడు. నిజామాతని యెదలోఁ బాలుపిండెను. అదియే భగవంతుని యింద్రజాలము. ఐదు నిమేషములకు ముందు ఛటోపాధ్యాయుని ముఖము మ్లానమై యుండెను. అప్పు డది వాడిన పూవు. ఇంతలో నది వికసించిన పద్మము. మానవ జీవిత మంత విచిత్రమైనది. మగఁ డుల్లాసముతో నింటికి వచ్చినది చూచి వరదసుందరి సంతోషముతో ''నేమే''మని ప్రశ్నించెను. నిజామన్నమాటను భర్త వరదసుందరి కెఱిఁగించినాఁడు. ఆమె యానందమే యానందము!

ప్రయాణ దినము నిశ్చయింపఁ బడినది. ప్రయాణమునకై నిజాము ధనసహాయ మొనర్చెను. సరోజినీదేవి కీ కథలన్నియుఁ దెలియును. ఆమె తల్లిదండ్రుల సంభాషణములన్నియు విననట్లుగా విన్నది. నాయుఁడు గారి విషయమై వారు గుజగుజలు వోయిన సమాచారము గూడ నామె

గమనించెను. కాని, సరోజినీదేవి పల్లెత్తుమాట యనలేదు. మౌనముతో నామె ప్రయాణమున కంగీకరించెను.

1895 వ సంవత్సరమున సరోజిని సీమకుఁ బ్రయాణము గట్టెను. ఉన్నత విద్య నభ్యసించుటకై యామె సీమ కేఁగుచున్నది. ఇది బాహ్యమైన కారణము. నాయుఁడు గారిపై నామెకున్న కన్ను దప్పించుట యాంతరిక కారణము.

---

# 4. సీమలో

సుమారిరువది యేండ్లలో ముగ్గురు విశిష్ట వ్యక్తులు భారత దేశమునుండి ఇంగ్లండునకు వెళ్ళిరి. ఆ మువ్వురును ప్రపంచ ప్రసిద్ధులైనారు. వారిలో మొదటివాఁడు గాంధీమహాత్ముఁడు; రెండవది సరోజినీదేవి; మూఁడవవాఁడు నేఁటి భారతదేశ నాయక రత్నము జవహర్ లాల్ నెహ్రూ! వీరు మువ్వురును పాశ్చాత్య విద్యలో నంతయో యింతయో ప్రయోజనమందినవారే!

గాంధీమహాత్ముఁడు ఇంగ్లండులో బ్యారిష్టరు పట్టమును బొందెను. నెహ్రూ హేరోలో, కేంబ్రిడ్జి విశ్వవిద్యాలయములో విద్య నభ్యసించెను. సరోజినీదేవి కూడఁ జదివినది కేంబ్రిడ్జి విశ్వవిద్యాలయమందే.

పాశ్చాత్యులు రాజకీయముగ మన కంత యుపకారమొనర్చియుండక పోవచ్చును. కాని, వైజ్ఞానికముగ మనము వారివలనఁ బొందిన మేలు త్రోసివేయఁదగినది మాత్రము గాదు. ఆ విద్య మానవునకుఁ జక్కని విమర్శన దృష్టి నొసఁగుననుటలో నుత్ప్రేక్ష లేదు. పైఁగా విశాల దేశ సంచారము మానవుని భావములను విశాల మొనర్చును. అట్టివాఁడు పర మతములను, పరుల యాచార వ్యవహారములను సహించుట కలవాటు పడును. ఆంగ్ల విద్య నభ్యసింపని పెద్దవారలలోఁ గొందఱట్టి విశిష్ట వ్యక్తులు లేరని మాతలఁపు గాదు. అది వారి సంస్కారము. కాని, సామాన్యముగ

బహు దేశాటనము, బహు బుధులతోడి సంవాదము మాన వుని వైజ్ఞానిక శక్త్య నభివృద్ధి నొందించుననని మన ప్రాచీనులే పలికిన సూక్తి.

సరోజినీదేవి లండను నగరముచేరి కింగ్స్ కళాశాలలో విద్యార్థిని యైనది. తండ్రి యాదేశానుసార మామె సీమకు వచ్చినదే కాని యఘోరనాథుని యాశను బూరించు చిత్తవృత్తి మాత్ర మామెకు సున్న. ఏ శాస్త్ర విద్యనో యామె ప్రధానముగ నభ్యసించి గొప్ప యుద్యోగమును, గౌరవమును సంపాదించునని యాతఁ డెంచెను. కాని, యామెచూపా వైపు లేదు. సాహిత్యము, కవిత్వము చిన్ననాఁటనుండి యామెకు వెన్నతోఁబెట్టిన విద్య. సీమఁ జేరినది మొదలామె కళాభిరుచి యింకను బాగుగ నెదిగినది. ఇతరుల కవిత్వములు, విమర్శనలు చదువుటతో సరోజినీదేవి ప్రొద్దులు పుచ్చెడిది; తానుగూడ నప్పుడప్పుడు రచనలు సేయుచుండెడిది. ఇంగ్లండు దేశములోని ప్రకృతి విలాస మామె నదియొక విధముగ నాకర్షించినది. ఆ పూవులు వింత వింతలు. మన దేశముల నున్న పుష్పముల యంత వాసన వానికి లేకున్నను వర్ణ విలాసములు మాత్రము మనోజ్ఞముగ నుండును. సరోజినీదేవి పని గట్టికొని యచ్చటి పచ్చిక బయళ్ళు, పార్కులు మొదలగు వానిలో నిరంతరము దిరుగుచుండెను. ఇది యామె కవితాశక్తి నుజ్జ్వలింపఁ జేసెను; కవితావస్తువు నయ్యెను.

ఆ దేశమునఁ బ్రకృతి మన దేశమున కంటెను గొంత భిన్నముగ నుండును. అక్కడ ముఖ్యముగఁ జలి యెక్కువ. ఆ వాతావరణమున కనుగుణమైన పుష్పములు, తీవెలు, చెట్లు నక్కడ పెరుఁగును. వానిని మన దేశములోఁ జూడలేము—మన దేశ ఫల పుష్పముల నక్కడ చూడ లేనట్లు. మన దేశమందే కొన్ని భేదము లున్నవి గదా! హిమాలయ పర్వతములను వీక్షించినచో నచట నున్న ప్రకృతి విలాసమే భిన్నముగ నుండును. అచ్చటి చెట్లు సామాన్యముగఁ బొడువెక్కువ; పొడువున్నంత గుబురుండవు. కాళిదాసు కుమారసంభవమున దేవదారు వృక్షములఁ బలు మాఱు వర్ణించెను. ఆ చెట్లు తుహినాచలమునఁ దప్ప మనకుఁ గనుపడవు. వాని యందమే యందము! మెట్ట దామరపూలు కవులందఱు వర్ణించినవే! వానిని మొట్టమొదట సాహిత్య మునఁ బ్రవేశపెట్టినవాఁడు గాళిదాసుగఁ దోఁచును. అవి హిమాలయమునఁ దప్ప వేఱొకచోటఁ గనుపింపవు. ఇఁకఁ గేరళదేశమునకుఁ బోయితిమా? అచటి ప్రకృతి విలాసమే విభి న్నము. అల్లిబిల్లిగ నల్లికొనియున్న మిరియపుఁ దీగెలు మన కంటికి కింపొసఁగును. అవి మన తములపాకుల తీగలవలె నుండును. ఆకులుగూడ నట్లే. పరీక్షించి చూచిననే తప్ప భేదము దెలియదు. ఏలకులచెట్లు, జాజికాయల వృక్ష ములు, లవంగపుఁ జెట్లు నా ప్రాంతములయందు మిక్కు టము. ఇవి యితర స్థలముల లేవు. ఒక దేశముననే యిన్ని

భేదము లున్నపుడు సీమలోనున్న ప్రకృతికిని మన దేశమందున్న ప్రకృతికిని, చెట్టు చేమలకును సామ్యమునకంటెను, భేదమే యెక్కువగ నుండుటలో నాశ్చర్యమేమి? అట్లే వారు ప్రేమించు పక్షులు, జంతువులుఁగూడ మనవానికన్న భిన్నములు. భారతదేశమునకుఁ గోకిల చాల ప్రియమైన పక్షి. గానమునకును మనకది యాదర్శము. ముద్దు ముద్దుగ నుండు పల్కులకుఁ జిల్క యాదర్శము. నృత్యమునకు నెమలి నుదాహరణముగఁ గైకొందుము. వారి పక్షులు వేఱు; వాని విలాసములు భిన్నములు. ఇవి యన్నియు నామె కవితా హృదయమును మేల్కొల్పెను. ఆమె కచటి పుష్పములలోఁ దానొక పుష్పమై భాసింపవలె ననిపించెను; అచటి మేఘము లలోఁ దానొక మేఘమై యాడవలెననిపించెను. ఆమె సీమలో మూఁడేండ్లు గడపెను. ఈ మూఁడేండ్లలో సరోజిని నిజమైన కవయిత్రిగఁ దయారయ్యెను; కాని, తండ్రి యనుకొన్నట్లు శాస్త్రపరిజ్ఞానము గలదిగఁ దయారు కాలేదు.

కళాశాలలోని యాచార్యులకెల్లను నామెయన్న నెంతయో ప్రీతి. ఆమె హృదయము, దానిలోని బాల్యము వారి నాకర్షించెను. ఆమె యెంత యమాయికురాలో యంత సూక్ష్మగ్రాహిణి. సరోజినీదేవి జీవితవిధానముగూడఁ గళాత్మకమైయుండెను; కాని, పనికిరాని వేషములు దక్కువ. తోడి విద్యార్థులతోఁగూడ సరోజినీదేవి యెంతయో మర్యాదగాఁ బ్రవర్తించెడిది. ఒకానొకనాఁ డామె దన స్నేహితురాలితో

సంభాషించుచుండెను. వారి ప్రసంగములోఁ బ్రసిద్ధుఁడైన ఎడ్మండ్ గాస్ అను విమర్శకుని గురించిన చర్చ వచ్చినది. అతఁ డానాఁడు పేరు మోసిన గ్రంథకర్త; కళావిమర్శకుఁడు; కవిగూడ. ఆ మహాశయుఁడు దమయింటి కెప్పుడును వచ్చుచుండెననియు, నాతఁడు దమ కుటుంబ స్నేహితుఁడనియు నామె సరోజినీదేవితో నన్నది. సరోజినీదేవి కాతనిఁ జూడ వలె ననిపించినది. ఆమె యాతని రచనల నిదివఱకే చదివెను; ఆతనిపై గొప్ప గౌరవముగూడ నుండినది. తనకోరిక నామె స్నేహితురాలికిఁ దెలిపెను. అట్లే యొనర్తునని యా స్నేహితురాలు మాట యిచ్చెను. కొన్ని దినములు జరగెను. ఒకానొకనాఁడు హఠాత్తుగ నా స్నేహితురాలు సరోజినీదేవి నివసించు బసలోనికి వచ్చెను. "నేఁడు గ్రంథకర్త గారు మాయింటి కరుదెంచుచున్నారు. మీవిషయ మింతకుముందే వారికి వ్రాసితిని. ఆ కమ్మలోనే మీకున్న కవితాహృదయమునుగూడ వెల్లడించితిని. ఈరోజు మనము వారితోఁ గలియవచ్చు"నని యామె యనెను. నాఁటి సాయంకాలము సరోజినీదేవి స్నేహితురాలి యింటికి వెళ్లెను. ప్రసిద్ధుఁడైన యా విమర్శకుఁడు గూడ నచ్చటికి వచ్చియుండెను. స్నేహితురాలు సరోజినీదేవి నాతనికిఁ బరిచయ మొనర్చినది. ఆతఁ డాదరపురస్సరముగ నిట్లన్నాఁడు :

"మీ రిక్కడ క్షేమముగానే యున్నారా? ఈ దేశము మీ శరీరరారోగ్యమునకు నచ్చినదా?"

సరోజినీదేవి యానందముతో గజిబిజియైపోయినది. అతఁడా నాఁటికే ప్రసిద్ధులలోఁ బ్రసిద్ధుఁడు. ఆమె మృదు మందహాసముతో నిట్లు బదులు చెప్పెను:

"ఇక్కడి నివాసము నాకు సుకరముగనే యున్నది. కాని, మీరు న న్నొకపదార్థముగ నెంచి సంభాషించి నన్ను గౌరవించుట యమూల్యమైన నా యదృష్టము."

సరోజినీదేవి వదనమునుండి యా పల్కులు జాఱినవి. వానిలో నొక కవిత్వముండెను. ఆమె యుచ్చారణ మనోజ్ఞమై యాతని నాకర్షించెను. ఆ యుచ్చారణలో నొక సంగీతముండెను. మిణుఁగురుఁ బురువులవలె గాంతిమంతములైన యామె కన్నులలోని కాంతఁడు చూచినాఁడు. అతఁడనెను : "మీ కవితాత్మను గుఱించి మీస్నేహితురాలీవఱకే పరిచయ మొనర్చినది. మీ హృదయము మీ మొదటిసంభాషణముననే నాకుఁ దేటతెల్లమయినది. మీకు గొప్ప భవిష్యత్తు గలదు."

సరోజిని జంకి : "నాపై నున్న దయాతిరేకమున మీ రిట్లు పలుకుచున్నారు. మీవలన నంతటి పొగడ్తకు నేను దగను."

అని వినయనమ్రముఖముతో నామె పలికినది. ఆమె పలికిన ప్రతిపలుకుఁగూడ నాగ్రంథకర్తహృదయముపై నొక కనుకట్టు విద్యగఁ బనిచేసెను.

వారి యీ మైత్రి కాలక్రమమున గాఢస్నేహముగ

రూపొందినది. ఆ యిరువురు మాటిమాటికిఁ గలసికొను చుండిరి. మిక్కుటముగ ఎడ్మండ్ గాస్ నాకర్షించినది సరోజినీ దేవిలో నున్న హాస్యప్రియత్వము.

ఒకానొకనాఁడు వారి క్రింది సంభాషణ జరగెను. సరోజినీదేవి మొదలు పెట్టినది:

"ఈ దేశమునందలి ప్రకృతి నామనస్సున కెన్నియో నృత్యముల నేర్పినది. ఈ దేశమునకు వచ్చుటతో నా కవితా కుమారి చిత్రవిచిత్రములైన విన్యాసముల నభ్యసించినది. ఈ ప్రకృతిని గుఱించి నే నెన్నియో పద్యము లల్లితిని."

ఆతఁడనెను: "చాల సంతోషము. ఒక రెండు మూఁడు పద్యములు మేము చూడవచ్చునా?"

సిగ్గుతో సరోజినీదేవి చెక్కిళ్లపై గులాబీలు పూచెను. ఆమె సంకోచించుచున్నట్లు కనుపడినది. ఆగ్రంథకర్త మరల ని ట్లారంభించినాఁడు :

"తమరు జంకవలసిన పని లేదు. మీకవితలు చక్కఁగా నుండును. మీ శక్తిని నే నెన్నఁడో గ్రహించినాను. దయ చేసి కొన్ని చదువుఁడు!"

సరోజినీదేవి చదువ నారంభించెను. ఆతఁడు నెమ్మదిగ నన్నియు విన్నాఁడు. అనంతర మతఁడనెను :

"మీరచన చాల బాగున్నది. మీకున్న సూక్ష్మ దృష్టి చాలమంది పెద్దలకు లేదు. పదునాలేండ్ల వయస్సున నింతటి విజ్ఞానము సంపాదించికొన్నవా రెవ్వరును మా

దేశమున నింతవఱకును నాకంటఁ బడలేదు. అన్ని విషయ ములు చాల బాగుగ నేయున్నవి. కాని...."

సరోజినీదేవి చెవులు ఱిక్కించెను. ఆమెకున్న యాసక్తి యంతయు నీ "కాని" యను మాటపైననే.

ఆ గ్రంథకర్త యన్నాఁడు : "పాశ్చాత్యదేశ ప్రకృతిని గుఱించి వర్ణించుట కంటెను మీరు మీ దేశపరిస్థితు లనుగూర్చియే కవితలల్లుట మంచిదని నా యభిప్రాయము. కారణ మేమనఁగా, ఆ పక్షులు, పువ్వులు, కొండలు, నదులు మీరు దినదినమును జూచుచునో, భావించుచునో యున్నవి. ఆ యావేశము సహజమైనదిగ నుండును. మా దేశప్రకృతిని గుఱించి మీ రెంతపొగడినను, ఆ యావేశము కృతకమే! నే నీ మాట లనుచున్నానని మీరు గోపింపరాదు. స్పష్ట ముగ నా హృదయాభిప్రాయమును మీ కెఱిఁగించితిని. ఇది కావ్యవస్తువునకు సంబంధించిన విమర్శ. ఇఁక రచనను గుఱించి: మీ రచన చాల గొప్పది. అన్ని సౌందర్యములు గూడ దాని కమరియున్నవి. సరే కాని..." ప్రసిద్ధ విమర్శ కుఁడు గొంతసేపాఁగెను.

ఆమె యందికొన్నది: "తమ యభిప్రాయమేమో పూర్తిగఁ జెప్పవలెను. నే నణు మాత్రము గూడఁ దమ రొనర్చు విమర్శనమునకై బాధపడను. మీ యెదుట నే నొక శిశువును."

ఎడ్మండ్ గాస్ ప్రస్తావించెను. "మీరు కవిత్వ

మెట్లారంభించితిరి ?''

సరోజినీదేవి పక పక నవ్వినది. ''ఇంతేనా? ఒకా నొకనాఁడు నేను గణితమునందు ఆల్జిబ్రా లెక్క నొకదానిని వేయుచుంటిని. మొదటి నుండియు నాకు గణితము రాదు. ఆ లెక్కను వేయుట నాకుఁ జాల విసుగుగ నుండెను. ఆ విసుగులోఁ గవిత్వము వ్రాయవలె ననిపించినది. రెండు పంక్తులు వెంటనే నాకు స్ఫురించెను. కాని, నా పుస్తకము లోనే వ్రాసితిని. అదే నా రచనకు శ్రీకారమయినది. నాఁట నుండి నా యాల్జిబ్రా పుస్తకము కవితా పుస్తకముగ మాఱి పోయినది. నాకుఁ దోఁచిన కవిత్వము లన్నియు నందులోనే వ్రాయుచుంటిని.''

పాశ్చాత్య విమర్శకుఁడు చిఱునవ్వు నారంభించి చాల చక్కని యారంభ మన్నాఁడు. ఆ నాఁటికి వారిరువురును బరస్పరము సెలవు గైకొనిరి.

సరోజినీదేవి కేంబ్రిడ్జి యందలి గర్టన్ కళాశాలలో విద్యార్థినిగఁ జేరెను. ఇది స్త్రీల కళాశాల. లండన్ నగర మున నామె విద్యాభ్యాసము తృప్తికరముగ లేదంటిని. కేంబ్రిడ్జియందుఁ గూడ నంతే! ఆమె యొక్కసారి యైనను దన పాఠ్య పుస్తకములఁ జదివెడిది గాదు; ఇతర విషయముల నెన్నియో యభ్యసించు చుండెడిది. కవితారచన మామెకు నిత్యకృత్యమైనది. అక్కడఁ గొంతమంది కవులతో నామెకుఁ బరిచయ మేర్పడెను. వారిలోఁ గొంద ఱుపచీయమానులు ;

కొందఱు లబ్ధ ప్రతిష్ఠులు. ఆమెకుఁ బరిచితులైన లబ్ధ ప్రతిష్ఠులలో ఆర్థర్ సైమన్స్ అను నాతఁడొకఁడు. ఇతఁడును బ్రసిద్ధ విమర్శకుఁడు; కవి. ఎడ్మండ్ గాసు వలెనే యీతని కీర్తి కూడ దిక్కులకుఁ బ్రాఁకినది. సరోజినీదేవి యొక్క రచనా పాటవ మాతని నాకర్షించెను. ఆమె రచనలఁ గొన్నిటి నాతఁ డెంతయో యాసక్తితోఁ జదివినాఁడు. లండను నగరమున ఎడ్మండ్ గాసు మహాశయుఁడు దన విషయమై యొసఁగిన విమర్శనముల నాతని కామె వినయముతోఁ జెప్పెను. లండన్ విమర్శకుని యభిప్రాయములతో సైమన్స్ మహాశయుఁడు సంపూర్తిగ నేకీభవించినాఁడు. కాని వారిర్వురు నామె యపార భాషా పాండిత్యమునకు ముగ్ధులైనారనుట నిశ్చయము. ఆర్థర్ సైమన్స్ మహాశయుఁడు సరోజినీదేవి విషయమై గొప్ప యాశ లుంచికొనెను. వారి వంశము పండిత వంశమనియు, సరోజినీదేవి తల్లియుఁ జక్కని కవయిత్రి యనియు నాతనికిఁ దెలిసినది. కవితాశక్తి సరోజినికి రక్తగతమైన గుణమని యాతఁడు గ్రహించెను. అన్నిటికంటె ముఖ్యముగ నాతని నాకర్షించినది యథాప్రకార మామె హాస్యప్రియత్వమే. ప్రతి వస్తువునందును సౌందర్యమును గమనించుటామె యలవాటు. జీవితమున దుఃఖమున కంటెను సుఖమనుభవించి యానందించుట సరోజినీదేవి కంటి వచ్చిన యభిరుచి. ఇది మన దేశమునకుఁ గ్రొత్త యభ్యాసము గాదు. మన ప్రాచీన. ఋషులీ సంప్రదాయమునే వేయినోళ్ళతోఁ బ్రపంచ

మున కెలుఁగెత్తి చాటిరి; తమ జీవితములలో ననుభవించి యానందపడిరి. "ఈ సమస్త ప్రపంచమును నానందము నుండియే మొదలగుచున్నది; ఆనందముతోనే బ్రదుకు చున్నది; కడ కానందములోనే లీనమై పోవుచున్నది."–ఇది యుపనిషదృషులు ఘోషించిన పరమ సత్యము. ప్రపంచ మున నొక్కొక్క మత మొక్కొక్కదానిని ప్రేమింపఁ జొచ్చెను. కొన్ని మతములు నీ మతమునకుఁ జెందిన వానిని ప్రేమింపుమన్నవి. మఱికొన్ని మానవునిఁ ప్రేమింపు మని ఘోషించెను. కొన్ని సంప్రదాయములు మానవునే కాక పశు పక్ష్యాదులను గూడ సానుభూతితోఁ జూడవలెనని శాసించి నవి. ఆర్యవాణి వీని యన్నిటికంటెను గంభీరమైనది. అది విశ్వమునే ప్రేమింపవలెనని శాసించెను. చెట్లు, పుట్టలు, గుట్టలు—ఇవి యన్నియు సచేతనములే యనియు, వీనిని నొప్పించుట మహాపాపమనియు ఋషు లెన్నఁడో గ్రహించిరి. డార్విన్ మహాశయుఁ డెలుఁగెత్తి చాటిన పరిణామ వాదము మనకుఁ బ్రాచీనమైనదే! ఏ పదార్థమునకును నాత్మ లేదని మన ఋషు లంగీకరింపరు. ఱాయియం దాత్మ యున్నది; పుట్టయం దాత్మ యున్నది. ఋషులు పలికిన యీ జ్ఞానమే సరోజినీదేవి హృదయమున వయస్సు గడచుకొలఁదియు నెదిగి వికసించినది. ఆమె నిజమైన ఋషివాక్కును గవితలో వెల్లడింప నారంభించెను. పాశ్చాత్య దేశములం దామె యున్నను, తాత్కాలికముగ వారి నాగరికత గొంత యల

వడినను సరోజినీదేవి హృదయమందలి మూల పదార్థము మాత్రము మాఱలేదు. ఈ నడుమ మన వేదాంతముపై నొక కృతకమైన విమర్శనము బయలుదేఱినది. మనకు బర లోకముపై ననే చూపుదప్ప నైహిక ప్రపంచముపై నాసక్తి లేదని యాతెగవా రందురు. ఇది సత్యమైన విమర్శనము గాదు. మన ప్రాచీనులవలె జీవితమును ప్రేమించినవారు, అనుభవించినవారు చాల తక్కువ. కాని, పరలోకమును బూర్తిగ మఱచి యిహమునే పట్టి ప్రాకులాడుట మనజాతి హృదయమునకు గిట్టని స్వభావము. ఇహమును బూర్తిగ మఱచి పరమునే సాధింపఁ దలఁచువాఁడు మూర్ఖుఁడు గదా! అట్లే యిహమును నమ్మి పరమును విశ్వసించువాఁడును మూర్ఖుఁడే. ఈ రెంటిని సమన్వయపఱచికొని మానవుఁడు బ్రదుకవలెను. ఆ పనినే మన ఋషులొనర్చిరి. మన భక్తులు, జ్ఞానులు—వీరు సాధించిన సిద్ధి యదియే! గత చరిత్ర నవలో కించినచో నే మహనీయుఁడు గూడ నైహిక ప్రపంచమును విడిచి దూరముగఁ బరువెత్తినవాఁడు లేఁడు. విద్యారణ్యుఁడు మహాజ్ఞాని. అతఁ డొకసామ్రాజ్యమును సృష్టించెను. సమర్థ రామదాసు బ్రహ్మవేత్త. అతఁడు శివాజీవంటి రాజును భారతదేశమున కిచ్చెను. తులసీదాసు బ్రహ్మనిష్ఠుఁడు. అమృతమును బంచి యాతఁడు గావ్య మల్లెను. ఆ కావ్య మొక జాతి నుజ్జీవింపఁ జేసెను. ఒకఁడేమి? ప్రతి బ్రహ్మ వేత్తయు నింతే! ఈ భావములన్నియుఁ జిన్ననాఁటనుండియు

సరోజినీదేవి హృదయమున గాఢముగ నాటుకొన్నవి.

ఇంతలో నామె కారోగ్యము చెడెను. సరోజినీదేవి యెక్కువగఁ జదువరాదని వైద్యు లాదేశించిరి. జీవితమునఁ గొంత మార్పుకూడ నవసరమని వారి సూచన. వారి యాదేశానుసార మామె స్విడ్జర్లాండునకుఁ బ్రయాణము గట్టెను. పాశ్చాత్య దేశములలో నీభాగ మొక సుందరమైన భూమి. ఆ దేశమున నెక్కడఁ జూచినను రమణీయములైన కందరములు, హిమాచ్ఛాదితములైన పర్వతశ్రేణులు. ఈ ప్రకృతిసౌందర్య మామె మనసునకు హాయిని గలిగించినది. స్విడ్జర్లెండు మంచి యారోగ్యప్రదేశముగూడ. ఆగాలి మంచిది. సరోజనీదేవి యచట గొన్ని దినములుండెను. అటనుండి యామె ఇటలీ దేశమునకు వెళ్లెను. ఇటలీ దేశము యూరోపుఖండమున నావేశ కేంద్రము; అక్కడి శీతోష్ణ స్థితియు యూరపుఖండమునందలి తక్కిన భాగములకంటె మిన్న; ఎక్కువ యుష్ణప్రదేశము గాదు. ఇతరభాగములం దున్నచలియు నక్కడఁ దక్కువ. ఇటలీలో మనోహరములైన పొలములు, తోఁటలు, ఇంపైన పుష్పములు. వీని యన్నిటి కంటె నొక గొప్పగుణ మాదేశమున నున్నది. అది దాని కీర్తి. ఒకానొకనాఁడు చరిత్రలో నదివహించినపాత్ర మహా ప్రధానమైనది. ఇటలీకి ముఖ్యపట్టణమైన రోమునగర మనేక కాలము చరిత్రలో జిగజిగ మెఱసిపోయినది. ఆ దేశమున మహావీరులు జన్మించిరి; మహాపండితులు పుట్టినందిరి. మహా

సామ్రాజ్యము లాదేశమున నిర్మింపఁబడెను. వారి ఖడ్గముల కాంతి యొకానొకనాఁడు ప్రపంచమునే మిఱుమిట్లు గొలిపినది. అన్ని ఖండములయందును వారు రాజ్యములను సంపాదించిరి. ఆజాతి కావేశమే ప్రాణము. ప్రపంచ ప్రసిద్ధులైన రచయితలిటలీ దేశమం దుండిరి. కాని, మానవునకు సుఖదుఃఖములు, రథచక్రగమనమువలె, మాఱుచుండును గదా! అట్లే యొక దేశమునకుఁగూడ. కాలక్రమమున రోమునగరమునకుఁ బ్రాధాన్యము తగ్గినది. కాని, అది సంపాదించికొన్న కీర్తిమాత్రము నేఁటికిని రత్నకోటీరమువలె వెలుఁగుచునే యున్నది. ప్రపంచచరిత్రను జదువు విద్యార్థి యెవ్వఁడును ఇటలీదేశమును బాగడకయుండ లేఁడు. నేఁటికిని అది క్రిశ్చియన్ మతకేంద్రము. క్రిశ్చియన్ సంప్రదాయమునకుఁ జెందిన ప్రధానాచార్యుఁ డచ్చటనే నివసించుచుండును. ఆతఁడు వసించు భాగమునకు వ్యాటికన్ అని పేరు. సంగీతము, చిత్రలేఖనము, శిల్పము, కవిత్వము—ఒకటి యేమి? ఎల్లదానియందును ఇటలీదేశ మందెవేసిన చేయి.

సరోజినీదేవి కవితాహృదయమును ఇటలీ మరింత యుద్రేకపఱచెను. ఆదేశమున నామె చూచిన దృశ్యములు మఱువరానంతగాఢముగ సరోజినీ హృదయముపై ముద్రితములైనవి. ప్రాచీనకళాకారులు రచించిన చిత్రముల నామె చూచెను. వారి రచనానైపుణ్య మామెను ముగ్ధురాలి నొనర్చెను. సీజరు శిలావిగ్రహమును గాంచినపుడు సరోజిని

శరీరము గగుర్పొడిచినది. ఆమూర్తి కాకళాకారుఁడు చేసిన ప్రాణప్రతిష్ఠ యంతటిది. ఇఁక నెన్ని దృశ్యములో యామె చూచెను. చూచిన యొక్కొక్కటియు నామె హృదయమును లోఁగొనెను. ఆదేశమున నామె కొన్నినెల లుండెను.

మరల సరోజినీదేవి లండను నగరమునకు వెళ్లెను; చదువ నారంభించెను. ఆమె మనస్సునకును కళాశాల విద్యకును లంకె కుదురలేదు. ఎంత ప్రయత్నించినను పాఠములామె కత్తుకొనుటయే లేదు. మఱి తా నిక్కడ నుండుట దేనికి? తన తండ్రియైన యఘోరనాథుని మోసపుచ్చుట కామె కిష్టములేదు. ఆమెకుఁ జదువుపై మనస్సు లేదు. 1898-వ సంవత్సరమున సెప్టెంబరు మాసమున సరోజినీదేవి యోడనెక్కి ఇండియాకు మఱలి వచ్చినది. ఆమె కప్పటి వయస్సు 19 సంవత్సరములు.

---

# 5. గృహిణీ జీవితము

పందొమ్మిదవ యేఁటనే యామె చక్కని కవితలను రచించెనని చెప్పితిమి. ఆంగ్లదేశమునం దున్నప్పు డామె పలు చోటులందుఁ బ్రశంసల నందెను; ప్రసిద్ధులైన విద్వాంసులతో నెల్లఁ బరిచయము సంపాదించెను. అనేక సభావేదికములనుండి యుపన్యాసము లొసఁగెను. ఆమె వాగ్విన్యాసము చెవుల కింపైనది. ఆ భావములు సముద్రతరంగములవలె లేచుచుండెను. ఆయుపన్యాసములు విన్నవారు మంత్రముగ్ధు లగుచుండిరి. ఈ వార్తలన్నియు నప్పటికప్పు డఘోరనాథుని కందుచునే యుండెను. దీనితో నఘోరనాథునకుఁ గుమార్తె దన యాశయమును బూరింపలే దన్నకినుక మాయమైనది. అనిష్టములైన భావములను నెత్తిపై వేసి రుద్దు దురభిరుచి యాతనికి లేదు. ఆంగ్లదేశమున నూఁడేండ్లు వసించి విశ్వవిద్యాలయపట్టము నేమియుఁ బొందకయే యామె తిరిగి వచ్చినది. కాని, యాతండ్రి బాధపడలేదు. ఆమె యితర శక్తులను గూర్చి యాతఁ డెంతయో సంతసించెను.

అతఁ డామె నాంగ్లదేశమునకుఁ బంపుటలో విద్యాభ్యాసమే కాక మఱియొక కారణముగూడ నుండె నంటిమి. అఘోరనాథుని యాతలఁపు గూడ నెఱవేఱలేదు. గోవిందరాజుల నామె మఱువలేదు. మాతృదేశమునకు దూరముగఁ బంపినచో నామె యా కథలను మఱచిపోవునని తలిదండ్రులు భావించిరి. దూరమే యామె మనోభావముల నింకను

బ్రోదిగఁ బెంచినది. ఇంగితజ్ఞుఁడైన ఛటోపాధ్యాయుఁడు సరోజినీదేవియొక్క మనోభిప్రాయ మెన్నఁడో గ్రహించెను. పైఁగా నామె యారోగ్యముగూడ దినదినమునకుఁ దగ్గు చున్నది. ఆమె తన శరీరముపైఁ దగిన జాగ్రత్త దీసికొనుట లేదు. జీవితములో నొక యుదాసీనభావ మామెలోఁ బెరిఁగి పోవుచున్న ట్లాతఁడు గ్రహించెను.

గోవిందరాజుల వివాహమునుగూర్చి యనుకొన్నంతనే మఱలఁ బ్రాఁత ప్రశ్నలే యఘోరనాథుని యెదుట సాక్షాత్కరించెను. నాయుఁడు భిన్నజాతీయుఁడు. అతఁడు సజ్జనుఁడే! ఆతని వంశముగూడ మర్యాదగలది. అతని గుణగణములనుగూర్చి యింతవఱకుఁ బొగడినవారేకాని తెగడినవారు లేరు. పదునెనిమిదవయేఁట నాతనికి వివాహమయ్యెను. ఒక వసంతము గడవకముందే యామె గతించెను. ఈ చింతతో నాతఁడు కృశించినాఁడు. ఈచింతను మఱచి పోవుట కాతఁడు యూరపునకుఁ బోయినాఁడు; అట వైద్య వృత్తిని జక్కఁగ నభ్యసించినాఁడు. వెనుకకు వచ్చునప్పుడాతనివెంటఁ జక్కనికీర్తి, మొక్కవోనిగౌరవము వచ్చెను. నాయుఁడుగారన్నచో నానాఁడు హైదరాబాదులో ననేకులకు గౌరవము. వైద్యుఁడుగా నాతఁడు గొప్ప ప్రఖ్యాతికి వచ్చెను. అతఁడు సరోజినీదేవిని మనసారఁ బ్రేమించినాఁడు. దానికిఁ జలనములేదు. అది యార్ద్రమైయుండెను. అతఁడు మరెవ్వరిని వివాహమాడఁ దలంపలేదు.

ఇక సరోజినివిషయమందమా ? ఆమెగూడ నాతని యం దాస క్తురాలు. మూఁడేండ్లు గడచినను సరోజిని యాత నిని మఱచిపోలేదు. పైఁగా నాచింతతో శరీరమును గృశింపఁజేసికొనుచుండెను. ఆమె భావములను జంపుట మన స్వియైన తండ్రికి మహాపాపముగ భాసింపఁజొచ్చెను.

మఱి సంఘము ! ఈప్రయత్నమున కాతఁ డంగీకరించి నచో మఱుదినమునుండి సంఘ మాతనిపై లెక్కలేని యుభాండముల నెత్తును. ముందే యాతఁడు మనస్వి యంటిమి. అఘోరనాథుఁడు వరదసుందరిని సలహా యడిగి నాఁడు. ఆమె ధైర్యముతో నా వివాహమునకు సమ్మ తించెను. 1898–వ సంవత్సరమున వివాహము జరగిపోయి నది. సనాతనులు దానిని ఖండించిరి; సంఘసంస్కర్తలు విభిన్నదృష్టితోఁ జూచిరి. ఎవ రేమనుకొన్నను కాఁగలయది కాకమానదు.

సరోజినీదేవి భర్తయింట నడుగువెట్టెను. ఆమె ప్రవేశించినదే మొదలాయిల్లు గలకలలాడినది. నాయుఁడు గారి జీవితమునఁ బూవులు వికసించెను. ఆమె ప్రతిమాటయు నాయన కొకమంత్రముగ, ఒక యద్భుతసంగీతముగ నుండెను. ఆయిల్లు కవితాగానములతో ఘూర్ణిల్లుచుండెను. ఆమె కాతఁ డనిన నెంతయో ప్రేమ. నాయుఁడుగా రింటనున్నప్పు డామె యాదర్శగృహిణియై యాతని మనస్సు నలరించెడిది. ఉపాధికై యాతఁడు బయటఁ దిరిగి మఱలి వచ్చినపు

డాగృహిణి యాతని తలపైఁ జిఱునవ్వులు గ్రుమ్మరించును. తన వైవాహికజీవితము స్వర్ణస్వప్నమువంటిదని యామె యనేకపర్యాయములన్నది.

వివాహము రెండాత్మల కలయిక. అది మనస్సులతో సంబంధములేని పశుబంధము గాదు. కాని, యట్టి వివాహములు జరుగుటమాత్ర మరుదు. ప్రతిదానియందును సంఘము చేయిగలిగించుకొని యేవో నియమములను గల్పించి మనుష్యులను గ్రుంగఁదీయును. మనస్సులతో సంబంధములేని వివాహము మరణఘంట. కొంతకాలమునకు వారి ప్రవృత్తులు భిన్నములై పరస్పరము విడిపోదురు; లేక, నీడలవలెఁ గలిసియుఁ గలియక వెట్టిబ్రదుకులు బ్రదుకుదురు. వీరి వైవాహికబంధ మట్లు పరిణమింపలేదు. వారి యింట నడుగడుగున నానంద ముండెడిది.

గృహిణీత్వమును నిర్వహించుచున్నను సరోజినీదేవి పుస్తకములను మఱువలేదు. తీఱిక దొరకినపుడంతయు నామె గ్రంథరచయితలతోఁ బ్రొద్దులుపుచ్చెడిది. ఆ జ్ఞానదాహమున కంతే లేదు. భార్యాభర్త లొక్కొక్కప్పు డుల్లాసముగ మాటలాడుకొనుచుందురు. ఆమాటలలో నామె యనంత జ్ఞానము నొలుకఁబోయును. నాయుఁడు గారేమియు మాటలాడరు. ఆమె వచించునదంతయు వినుటయే యాతని కానందము. సంభాషణములలో నామె నేదో యొక తర్కమునకు దింపి యాతఁడు వదలిపెట్టును. ఇఁక నామె భావ

ములు వట్టుగొని కురియ నారంభించును. అవి గుత్తులు గుత్తులై పడెడు నందనోద్యానపుష్పములు; తానై వలచి కామధేనువు చేపిన పాలు.

సరోజినీదేవికి నలుగురు పిల్లలు గలిగిరి. వారిలో నిరువురాఁడుపిల్లలు; ఇరువురు గొడుకులు. మొదటికూఁతురు పద్మజ; రెండవ యామెపేరు లీలామణి. జయసూర్యుఁ డొక సుతుఁడు. రెండవవాఁడు రణధీరుఁడట!

ఇంత విద్యావ్యాసంగమున్నను నామె సంతానము యొక్క రక్షణమును గుఱించి యెప్పుడును బ్రాలుమాల లేదు. పుస్తకములు విసుగైనపు డామె వారలతోఁ జేరి యాడుకొనుచుండెను. అపు డామె వారి హృదయపుస్తకములు చదువును. శిశువుల హృదయములను జదువుట యది యొక విద్య. ఆ విద్యలేనిది తక్కినవి పూర్తిగావు. పరిపూర్ణ జ్ఞానులు శిశువులవంటివారఁట! వారిలోని యమాయికత నలవరచికొన్నప్పుడే మానవుఁడు గొప్పవాఁడగుట! వారి చేష్టలు, నవ్వులు సరోజినీదేవి హృదయమునఁ గ్రొత్తకవిత్వములను సృష్టించెడివఁట! సరోజినీదేవి యాదర్శగృహిణి యైనట్లే యాదర్శమాతయై తన ధర్మమును నిర్వహించెను; సంతానముపై నెక్కువ జాగ్రత్త గైకొనెను; వారి నెంతయో ప్రేమించెను. కాని, యాప్రేమ నియమశిక్షణ మున కడ్డురాలేదు. మాతృప్రేమ యనఁగా నది గ్రుడ్డిగా వారిని బ్రేమించి వారి తప్పులన్నియు నొప్పులుగా

సమర్థించుట గాదు. మఱి వారి తప్పులను దిద్ది యొప్పులు నేర్పించుట!

ఈనాళ్లలో సరోజినీదేవి గొంత సంఘమునైపునకుఁ గూడ తనదృష్టిని మరల్చెను. దానికిఁ గావలసిన యన్ని యోగ్యతలు నామెకుండెను. ఆమె చక్కని విద్యావతి. లోకానుభవమెంతయో యామె కుండెను. విశాలభావము లామెకుండెను. విభిన్నచిత్తవృత్తుల నామె గమనించినది. మానవుల భావములపై నామె కెంతయో సానుభూతి యుండెను. అన్నివిధముల నామె సంఘమున కుపకారము సేయుయోగ్యత గలది.

ఇంతలో, హైదరాబాదు సీమలో వరదలు పొంగినవి. వానితోఁ బంటలు పాడయ్యెను; ఇండ్లు గూలినవి; ప్రదేశములన్నియు జలమయము లైపోయెను. ఇఁక బీదలకు నిలువ నీడ యేదీ? వారి గుడిసెలను గంగాదేవి యాహరించినది. వారి పశువులు చలికి గజగజ వణఁకి చచ్చెను. పిల్లలాఁకలితో నకనకలాడుచుండిరి. ఆ జనులకుఁ గట్ట బట్టలు లేవు; కడుపునకుఁ దిండి లేదు. ఆ యభాగ్యజీవులు వీథులలోఁ బడినారు. ఈ యుపద్రవములోఁ గేవల మొక్క బీదలేకాదు. కొంత జరుగుబాటు గల కుటుంబములుగూడ నెంతయో కష్టమను భవించెను. ఈ యభాగ్యజీవులను బల్కరించువారెవ్వరు? ధనికులకు వారి మొఱలు వినఁబడవు. వారు దమ యింద్రలోకములలో నిరంతరముఁ గ్రేగన్నులు మూసికొని

యుందురు. ఆ హృదయములకును దయకును గాని వావి. ఇఁక దరిద్రులకు దయ పుట్టియు, పుట్టకయు నొకటే! వారసమర్థులు. సరోజినీదేవి దేశమునకుఁ గల్గిన యీ దారుణ పరిస్థితిని గమనించినది. ఆమె నడుముగట్టి ముందునకు దూఁకెను. ఆ జనుల రక్షణకై యామె యిల్లిల్లు దిరిగి యాచించెను. నాయుఁడుగారు వారి కుచిత వైద్యసేవ యొనర్చెను. సరోజినీదేవి యా జనులకుఁ గడుపున కన్నము పెట్టెను; కట్ట బట్టల నిచ్చెను. ఆ గృహము విశ్వమానవుల గృహమగుట కిది మొదటి మెట్టు.

అది యామె సాంఘిక జీవనమునకు శ్రీకారమైనది. దానితో నామె వ్యక్తిత్వ మేమిటో నలుగురికిఁ దెలిసెను. వెంటనే యామె యితర సాంఘిక కార్యములకుఁ బూనుకొన్నది. సరోజినీదేవి దృష్టి నాకర్షించినది దళితలైన భారత స్త్రీలు. వారికి విద్యలేదు; స్వాతంత్ర్యము లేదు; తమ భావములను బయటికిఁ జెప్పికొను నోరు లేదు. అట్లు చెప్పరాదని ధర్మనిష్ఠులు శాసింతురు. ఏమి యీ మగవారి యన్యాయము! ఒకానొకనాఁడు భారతస్త్రీ యిట్లే యుండెనా? అయినచోఁ బ్రాచీనకాలమున స్త్రీలలో నింతటి మహిమాన్వితలెట్లు జనించిరి? ఇది సత్యముగాదు. ఈ స్థితి మనదేశమునకు నడుమంతరమునఁ బట్టిన చీడపురుగు. దీని నామె పెఱికివేయఁ దలఁచెను. మఱికొంద ఱిట్టి యుదారభావములు గలవార లామెకుఁ దోడైనారు. సరోజినీదేవి యీ విషయమై సంఘ

ములో నొక గాలి దుమారమును రేపినది. ఆమె యెన్నియో యుపన్యాసము లొసఁగెను; పత్రికలకు వ్రాఁతలు వ్రాసెను. ఆమె పూరించిన విజయ దేవదత్తమున కాకర్షింపఁబడి యెందఱో స్త్రీలు స్వార్థరహితలై గడ్డకు వచ్చిరి. గత స్వాతంత్ర్య సత్యాగ్రహములోఁ బురుషులతోపాటు స్త్రీలు గూడ ముందంజవేసి పాల్గొనఁ జొచ్చిరి. ఈయుత్సాహము నకుఁ గారణము సరోజినీదేవి యొనర్చిన కృషియే!

మఱి యీ కల్లోలములలో నామె కవిత్వమును మఱచి నట్లేనా? అట్లు జరుగలేదు. కవితారచన యామె జన్మగత గుణ మంటిమి. 1905 వ సంవత్సరమున నామె ఖండిక లొక పుస్తకరూపమునఁ బ్రకటితములైనవి.

ఆ గ్రంథమునకుఁ బ్రసిద్ధుఁడైన ఆర్థర్ సైమన్స్ పీఠిక వ్రాసెను. అందులో నతఁడామె కవిత్వమును గూర్చి యెన్నియో గొప్పభావములు వెలువరించినాఁడు. ఈ గ్రంథము నామె యెడ్వర్డ్ గాస్‌న కంకిత మొనర్చెను. ఇందుచే నాగ్రంథకర్తయెడ సరోజినీదేవి కెంత గౌరవ ముండెనో మన మూహింప వచ్చును. అతఁడామె కవితా శక్తిని భారతదేశ సౌభాగ్యమునై పు మఱలించెను.

సరోజినీదేవి తన భావముల నా గ్రంథపీఠికలో స్పష్ట ముగ వెల్లడించెను: "భారతదేశమున నొక యుజ్జ్వల ప్రాతః కాలము విరియుచున్నది. మున్నూఱు సంవత్సరములుగఁ బర దాస్య బంధితమై యున్న స్వాతంత్ర్య రథము నేఁడు దిన్నగఁ

గదల నారంభించినది. ఆ రథముయొక్క పగ్గములఁ బట్టుటకు స్త్రీ పురుషు లిద్దరు నుద్యోగింపవలెను. భారత స్త్రీ ఇఁక నవమానముల కోర్వలేదు. ఆమె మేల్కొన్నది. ఆమె త్యాగము, సాహసము, ధైర్యము, ప్రతిభ పురుషున కే మాత్రమును దీసిపోవునవి గావు. భారతదేశ స్త్రీ హృదయమున నీ భావజ్యోతిని వెలిఁగించుటకే నా వ్రాఁతలు, నా యుపన్యాసములు, నా జీవితమును.''

సరోజినిదేవి గ్రంథము గడ్డకు వచ్చినది. ఆ పద్యములు విశ్వమును ముగ్ధమొనర్చెను. నాఁటి పంచమజార్జి చక్రవర్తి యీ కవిత్వమునకు "కైజరు హిందు" బంగారు పదకమును బహుమానముగ నొసఁగెను. ఇది యసాధారణమైన గౌరవము. ప్రపంచమున నీగౌరవమును బొందిన భాగ్యశాలులు గొందఱే! భారతీయులలో నీగౌరవము రవీంద్రనాథ ఠాకూరునకుఁ దక్కెను. మఱి సరోజినీదేవికిఁ గల్గినది. వీ రిద్దరును భారతీయ కవితాకాశమున జిగజిగ వెలుఁగు చుక్కలు.

---

# 6. సాంఘిక జీవనము

ప్రజోపయోగకరములైన కార్యములలో నామె యెట్లడుగు పెట్టెనో యింతకుముందే కొంత దెలిపితిమి; భారతీయ స్త్రీల విషయమున సరోజినీదేవి పరిశ్రమించినదియుఁ గొంత వివరించితిమి. ఇఁక నామెను గలఁచిన మూఁడవ ప్రశ్న దేశముయొక్క పారతంత్ర్యము.

అప్పటికి గాంధీమహాత్ముఁ డింకను రంగమున దిగలేదు. అప్పటి రాజకీయాకాశ సూర్యుఁడు బాలగంగాధర తిలకు. అతఁ డతివాది. గోఖలే మహాశయుఁడు మితవాది. ఆంగ్లేయులతో నెప్పుడును గలసి మెలసి వారి నొప్పించియే స్వాతంత్ర్యమును సంపాదించికొనవలెనని గోఖలే మహాశయుని వాదము. బాలగంగాధరుఁ డొక యగ్ని పర్వతమువంటి వాఁడు. అతని హృదయ మెప్పుడును సత్యమునకై పొంగులు వారుచుండును. అతని వాక్యములు సవ్యసాచి బాణముల వంటివి. అవి గుఱితప్పుట యెన్నఁడును లేదు; తగిలిన లక్ష్యమును భేదింపనివియు లేదు. అతఁ డాంగ్లేయ ప్రభుత్వముతోఁ జేసిన పోరాటము మహాభారత యుద్ధమున భీష్మాదు లొనర్చిన పోరాటము వంటిది. శాంతరసమున కంటెను నాఁటి రాజకీయ వాతావరణమునఁ జిందులు ద్రొక్కుచున్నది వీర రసమే! మితవాదు లధికారములఁ జేపట్టి వాని మూలమున దేశమందు సంస్కరణములు గొనిరావలె నందురు. అధికారము నర్థించుట స్వార్థమని యతివాదుల

యభిప్రాయము. వా రీమితవాదులను స్వార్థపరులని దుమ్మెత్తి పోయుదురు. తిలకు మహాశయుని యుద్రేకమునఁ గొంత హైందవ పక్షపాత మణఁగియుండెను. ఆతఁడు నిక్కమైన మహారాష్ట్రుఁడు.

బ్రిటిషు పరిపాలకులు నక్కలవంటి వారు. ఎంతటి పటిష్ఠమైన సంఘమునైనను జీలికలు లేవఁదీసి, విభజించి పాలించుట వారికి వెన్నతోఁ బెట్టిన విద్య. వారు మొదటి నుండి యీ మహా సామ్రాజ్యమును సాధించినది భేదోపాయమును బ్రయోగించియే! దానినే నేఁడుగూడ వాడిరి. హిందూ మహమ్మదీయ కలహములను రేకెత్తింపఁ జేసిరి. ఆ తరుణమున సరోజినీదేవి రాజకీయముల నడుగిడినది. ఆంగ్లేయులకు నచ్చిన నాయకుఁడు జిన్నా. అతఁడు భారత దేశమును విభజింపవలెనను సిద్ధాంతము నానాఁడే ప్రయోగించెను. ఆ సిద్ధాంతము ప్రభువులు గావించిన సృష్టియే! దేశమాత యొక్క హృదయము నీరీతిగ విభాగింపఁ దలఁచుట యందఱకును గష్టమయ్యెను. సరోజినీదేవి హిందువులకు, మహమ్మదీయులకు శాంతి దూతగ రంగమునఁ బ్రవేశించినది. జిన్నా, షౌకతాలీ వంటివారు గూడ యామెను గౌరవించుచుండిరి.

అది 1905 వ సంవత్సరము. సరోజినీదేవి హిందూ మహమ్మదీయ విభజన దేశానర్థ దాయకమని యెన్నో వేదికలనుండి ఘోషించెను. కలకత్తా, బొంబాయి, మదరాసు

మొదలగు చోటులలో నామె యార్తనినాదములు దేశ నాయకుల హృదయముల భేదించుచు వినఁబడినవి.

సరోజిని రాజకీయములతోఁ గవితారచనమును గొంత ప్రక్కకుఁ బెట్టవలసి వచ్చెను. కాని, యందు కామె బాధ పడలేదు. దేశము స్వాతంత్ర్యమును గోల్పోయినది. పరాధి కార దళితమైన జాతికి ముక్తిలేనిది – ఉన్నత భావములతో నిండియున్న కవిత్వములు పేక మేడలు. మూఁడు శతాబ్ద ముల క్రిందట ఇంగ్లండు దేశమునకు నీ స్థితియే యేర్పడినది. అప్పటి మహాకవి మిల్టన్. అతఁడు దన కవిత్వమును గడకుఁ ద్రోసెను. మహావీరుఁడై స్వాతంత్ర్య సమరమున ఉంకె వేసి దూఁకినాఁడు. నేఁటి రాజకీయములలో సరోజినీదేవి యీ పనినే యొనర్చెను.

ఆమెకు గోఖలే మహాశయుఁ డన్న నమిత గౌరవము. వారి మార్గముల నామె శ్రద్ధతో ననుసరించెను. ఇంతలో రాజకీయములలో నొక యద్భుత వ్యక్తి గాలిడెను. అతఁడే గాంధీమహాత్ముఁడు. ఆయన నింతకుముందే సరోజినీదేవి యొక సారి దర్శించియుండినది. అవి మొదటి ప్రపంచ సంగ్రామపు దినములు. ఆంగ్లజాతి జర్మనులతోఁ బోరుచుండెను. అపుడు గాంధీ మహాత్ముఁడు బ్రిటిషువారికి సాయ మొనర్పవలెనని దేశీయుల నుద్బోధించెను. తానుగూడ వారియుద్ధమున సేవ యొనర్చెను. ఆంగ్లేయులు భారత జాతిని పీడించుట యాతని కసమ్మతమే. కాని, వారు కష్టములలో నున్నపుడు సిలు

గుల఼ బెట్టరాదనియు నాత఼ డేర్పరచుకొన్న రెండవ ధర్మ సూత్రము. గాంధీ మహాత్ముని యభ్యర్థనముతో భారత దేశమునుండి యెంతయో ధనము బ్రిటిషువారికిసాయము చేయుటకై వెచ్చింప఼ బడెను. అనేక మహావీరు లా యుద్ధమున఼బోరి యసువుల఼ బాసిరి. అప్పు డాంగ్లేయులు భారతజాతికి స్వాతంత్ర్య మొస఼గుదుమని వాగ్దాన మొనర్చి యుండిరి. ఆ సన్నివేశమున సరోజినీదేవి గాంధీ మహాత్ముని దర్శించినది.

ప్రథను ప్రపంచ సంగ్రామము ముగిసెను. యుద్ధమున నాంగ్ల జాతి గెల్చినది. ప్రతిజ్ఞను బూరింపవలసినదని గాంధీ మహాత్మ఼ డాంగ్లేయులను గోరెను. కాని, సత్యము వేఱు; రాజకీయపు టెత్తులు వేఱు. వా రాతని మాటలు పెడ చెవిని బెట్టిరి; అభ్యర్థనకు఼ బ్రతిఫలముగ దేశనాయకులను గారాగారములలోనికి఼ ద్రోయ నారంభించిరి. గాంధీ మహాత్ము఼డు వారిని రొట్టె నడిగెను. వా రాతనికి ఱాయి నొస఼గిరి. దీనితో నింకను దేశమున నుద్రేకము చెలరే఼గెను. స్వాతంత్ర్య మొస఼గవలెనను నినాదములు తీవ్రములై చెల రే఼గినవి. పురుషు లనేకులు రాజకీయ రంగమున నతిరథులై పోరిరి. అనేకులు వీరనారులు చెఱసాలలకు వెళ్ళిరి. వారిని నడపించిన మహాశక్తి సరోజినీదేవి. 1916 వ సంవత్సరమున నామె యుపన్యాసములు దేశమున నలుమూలల విన఼బడెను. ఆ యుపన్యాసముల కనేకులు ముగ్ధులై తమ మనోధనములను

దేశ స్వాతంత్ర్యమునకై వెదచల్ల నారంభించిరి. అప్పటి యామె విజృంభణమును జవహర్‌లాల్ నెహ్రూ తన జీవిత చరిత్రలో బ్రహ్మాండముగ వర్ణించెను. అప్పటికి గాంధీ మహాత్ముఁడు రాజకీయరంగమునఁ బ్రవేశించెనే కాని నాయకత్వ మింకను నా మహామహునికి సంక్రమింపలేదు. ఆని బిసెంట్ వాక్సుమత్కృతి భారతదేశమును ముగ్ధమొనర్చిన దినములవి.

1916 వ సంవత్సరమున కాంగ్రెసు లక్నో నగరమున జరిగెను. అపు డధ్యక్షుఁడు అంబికాచరణ ముజుందారు. ఆ సభకు వచ్చిన కొందఱు సభ్యు లగ్రాసనములపై నధివసించి యుండిరి. వారిలో మన సరోజినీదేవియు నొకతె. ఈమె నా సభలో నొక ప్రతిపాదనను బ్రతిపాదింపవలెనని పెద్దలు గోరిరి. అది శస్త్ర శాసనముయొక్క ఖండన. దాని చరిత్ర మిది.

బ్రిటిషువారు భేదోపాయ నిపుణులంటిమి. అంతేకాదు; వారికున్న వంచనా పాండిత్య మమోఘము. వారి యంగిట బెల్లము; ఆత్మలో విషము. ప్రభువులైనదే మొదట నొక్కొక్కటిగ మన యధికారము లన్నియు వారు తగ్గించిరి. ఆ యుద్యమమునఁ బ్రవేశపెట్టినదే యీ శస్త్ర శాసనము. ఈ చట్టము ప్రకారము ప్రభుత్వముయొక్క యనుమతి లేనిదే భారతీయుఁడే శస్త్రమును ధరించుటకు వీలులేదు. కొంత పొడుగాటి కత్తియైనను వాఁడు పట్టుకొనరాదు. అట్లు ధరించుట యపరాధము. వాఁడు శిక్షార్హుఁడు. మన దేశము

రొక్క కోటలను బెజకివేయుట కేర్పడిన శాసన మిది. ఇది యన్యాయమని యూనాఁడామె ప్రతిపాదింపవలసిన విషయము.

ఇంతలో, కాంగ్రెసుసభలు జరగుచున్న చోటికి సర్ జేమ్సుమెస్టన్ మహాశయుఁడు భార్యాసమేతుఁడై యరుగు దెంచెను. అతఁడాప్రాంతములకు గవర్నరు. అతఁడరు దెంచినపుడు సరోజినీదేవి తన విషయమును బ్రతిపాదించు చుండెను. గవర్నరుదంపతు లామె యాంగ్లభాషాపాండిత్య మునకు ముగ్ధులైపోయిరి. భారతీయు లింత చక్కగా నాంగ్ల మును మాటలాడఁగలరని వారు గలనైనఁ దలఁపలేదు. ఆ దంపతులు సరోజినీదేవిని దమ గృహమున కాహ్వానించిరి.

ఇంతలోఁ గంచిలో కాంగ్రెసుసభలు జరగినవి. అవి మదరాసుకోస్తాకు సంబంధించినవి. వానికి సరోజినీదేవిని దమిళు లధ్యక్షురాలినిగ నెన్నుకొన్నారు. జన్మతో నామె వంగదేశీయురాలు. ఆంధ్రజాతివారి కామె కోడలు. ఆమె యసాధారణగౌరవము నందినది-తమిళనాడులో. ఇది విచిత్ర మైన సన్నివేశముగదా! సరోజినీదేవి యాసభలలో నొసఁగిన యుపన్యాసము స్మరణీయమైనది. ఆమె ప్రతిపదము నందును గవిత్వము దొనఁకులాడుచుండెను. ఆ యుపన్యాస ములతో ముగ్ధులైన యువకులు స్వాతంత్ర్యయుద్ధమునకు నడుముగట్టిరి.

క్రమక్రమముగ నీమె వ్యక్తిత్వము పరిపాలకుల కన్ను దెఱచినది. ఇంతటి యసాధారణశక్తిగల యీ

యువతి భారతదేశము నెంత యుద్రిక్తపఱచునో యని వారు భయపడిరి. కాంగ్రెసు బ్రిటిషువారికిఁ బ్రబలశత్రువు. ఆమె యాసంస్థలోఁ బ్రధానపాత్ర. సరోజిని నాసంస్థనుండి తప్పింపవలెనని వారు ప్రయత్నించిరి; ధనము నిత్తుమనిరి; గొప్పపదవుల నొసఁగుదు మనిరి. ఆమె యీ యాశలకు లొంగలేదు. ఈమంత్రమును వారామెపైననే కాదు; ఎందఱో దేశీయ నాయకులపైఁ బ్రయోగించిరి. కొందఱీయాశలకు లోఁగిరి. కొందఱు స్వార్థత్యాగులై నిలిచిరి. అట్టి కీర్తిపరులలో సరోజినీదేవియు నొకతె. ఈమంత్రమే యొకసారి జవహర్‌లాల్‌పైఁగూడ వాడఁబడెను. అతఁడు రాజకీయములనుండి విరమించినచో నొక గొప్ప పదవి నొసఁగుదునని యలహాబాదు హైకోర్టుజడ్జి సుదీర్ఘలేఖ వ్రాసెను. కాని, స్వార్థత్యాగు లాశలకు లొంగరు.

ప్రభువుల తాబేదారులతోనే కాక సరోజినికి సామాన్యజనములనుండియుఁ గొన్నికష్టములు సంభవించినవి. ఎవరిగతి వారిది లెమ్మని వారూరకుండరు. అవసరము లేనివానిలో నెల్లఁ జేయి చేసికొని యడ్డుప్రశ్నలు వేయుట వారి కొక యుద్యోగము. కొందఱామె నిట్లడుగుచుండిరి: "స్త్రీకి రాజకీయములు పనికిరావు. ఎంత చదివినను మీరు స్త్రీలు."

మరికొందఱాకరీతిగఁ బృచ్ఛించిరి: "మీది హిందూమతము. హిందూస్త్రీలు స్వేచ్ఛగ బయటఁ దిరుగుట యామతము నవమానపఱచుట. మీది గృహరాజ్యము."

మఱికొందఱు పని లేని పెద్దయ్య లిట్లువాదించిరి: "నీవు గృహిణివి; తల్లివి. గృహిణికి భర్తసేవయే ప్రధానము. పిల్లల యోగక్షేమములు విచారించికొనుట యే మాతృ కర్తవ్యము. రాజకీయములకంటె నీరెండు ముఖ్యములైనవి."

ఈ విమర్శనముల నన్నిటి నామె యోర్పుతో వినెడిది. ఆమె వారి కిట్లు బదులిచ్చును:

"నాయింటి పరిస్థితి నేనెఱుఁగుదును. నాభర్త నా రాజకీయజీవితమున కడ్డు దగులుట లేదు. నా సంతానముగూడ నాకు బాధకముగాదు. మీరు మాయింటివిషయమై యింత శ్రద్ధ దీసికొన్నందుకు మా ధన్యవాదములు. కాని, నన్ను దయచేసి నాదారిఁ బోనిండు." ఆమె రాజకీయములనుండి విరమింపనే లేదు.

లక్నో కాంగ్రెసునందు గాంధీ మహాత్మునితోఁ గూడ నామె యుపన్యాస వేదిక నెక్కెను. అప్పటి కాతఁడు భారత రాజకీయములగుఱించి యొక నిర్ణయమునకు రాలేదు. తాను నాయకుఁడుగ రాజకీయముల నడపవలసివచ్చుననియు నాతఁ డెఱుఁగఁడు. కాని, భారతరాజకీయ నేతృత్వ మాతనికి దైవదత్తమైనది. లక్నో కాంగ్రెసునకుఁ గొందఱు రైతు లరుదెంచిరి. వారు బీహారు ప్రాంతములవారు. గాంధీమహాత్మున కారైతులు దమ కష్టములను మనవిచేసికొన్నారు. బీహారుప్రాంతముల కరుదెంచి తమ స్థితిగతులను గన్నారఁ జూచిరావలసినదని వా రభ్యర్థించిరి. తొలుత మహాత్ముఁ

డంగీకరింపలేదు. కాని, యాతనికిఁ బోవక తప్పలేదు. బీహారు రాజకీయములు దన సత్యాగ్రహసమరమునకు శ్రీకారమగు నని యాతఁ డెఱుఁగఁడు. ఆప్రభాతసూర్యుఁ డప్పుడే భారత రాజకీయాకాశమునఁ దొలుత నుదయించెను. ఆతఁ డడుగు పెట్టినదే తడవు ఆమహాసీయుని తేజస్సు శత్రుదురాలోక మైనది. అతఁడు భారతదేశనాయకుఁ డైనాఁడు. ఆపదవి నాతఁడు కోరలేదు. కాని, దైవ మొసఁగెను. పెద్దలెల్ల రాతని యాధిపత్య మంగీకరించిరి. సరోజినీదేవి గాంధీ మహాత్ముని మరణమువఱకు నతనియాన జవదాఁటలేదు.

నాఁడు గాంధీమహాత్ముని పేరు దేశవాసులందఱి పెద వులపై నాట్యమాడినది. ఆతఁడు మహాయోగి. ఆతని రాజకీయములకు సత్యాహింసలు వెన్నుబలము. బుద్ధభగ వానుని యనంతర మట్టివ్యక్తి చరిత్రలో నుదయింపనేలేదు. ఆమహాయోగిజన్మచే భారతదేశమే కాదు విశ్వప్రపంచమే పవిత్రమైనది.

అది 1919-వ సంవత్సరము. అపుడు జలియన్‌వాలా బాగుదురంతములు సాఁగెను. అవి జరగిన దమృతసర స్సులో. ఆదురంతములు నడపిన రాక్షసుఁడు డయ్యర్ సేనాని. వాఁ డమాయికులైన స్త్రీపురుషులపైఁ దుపాకులఁ బేల్పించెను. ఆప్రయత్న మచట జరగుచుండిన కాంగ్రెసు మహా సభను జెదరఁగొట్టుటకై చేసినపని. వేలకొలఁది పురుషులు, శిశు వులు, స్త్రీలు నామారణహోమమున నాహుతులై పోయిరి.

వాఁడంతటితో నాఁగలేదు. అమృతసరమునం దమానుష ములైన శిక్షల నాతఁడు విధించెను. డయ్యెర్ సేనానియొక్క యీ రాక్షసకృత్యములను భారతదేశము బహిరంగముగ ఖండించెను. అపుడు భయంకరముగ గర్జించిన కాళికాదేవి సరోజిని. ఆమె యీదురంతముల నూరూరఁజాటెను. ఇంతలో నామె యారోగ్యసంరక్షణార్థమై యింగ్లండునకు వెళ్ళినది. అక్కడఁగూడ నూరకుండలేదు. డయ్యరుసేనాని దురంతరములఁగూర్చి సరోజిని యొసఁగిన యుపన్యాసములకు లెక్కలేదు. భారతదేశస్త్రీలకు డయ్యెర్ సేనాని యొనర్చిన యవమానముల నామె వారికి శక్తిమంతమైన భాషలో వివరించి చెప్పెను. బ్రిటిషుపరిపాలకు లామె నదలించిరి: "నీ వసత్యారోపణ మొనర్చుచున్నావు. క్షమాపణ చెప్పి కొనవలె"నని గర్జించినారు. ఆమె భయపడలేదు. "నేనొనర్చు ప్రతియారోపణమునకును బ్రబలసాక్ష్యమున్నది. ప్రతివిషయమును నేను ఋజువు చేయఁగలను. బ్రిటిషుపరిపాలకులకు దొమ్ములున్న వానిని ఋజువుసేయుట కంగీకరింపవలెను. అట్లు ఋజువు చేయఁగలిగినచో వారు నన్ను క్షమాపణ గోరవలయు"నని తిరిగి బదులిచ్చెను.

సరోజినీదేవి భారతదేశమునకుఁ దిరిగివచ్చెను. ఇఁకఁ బనియేమున్నది? రాజకీయజీవితమే! ప్రభువుల దమనశక్తి ప్రతిదినమును బెరిఁగినది. వా రనేకక్రూరశాసనము లొనర్పఁ జొచ్చిరి. దేశమున శాసనోల్లంఘన మారంభమయినది.

ఆ మహామంత్రద్రష్ట గాంధీ మహాత్ముఁడు. విద్యార్థులు కళాశాలలను బహిష్కరించిరి. న్యాయవాదులు న్యాయస్థానములకుఁ బోవుటలేదు. అధికారులు పదవులను బరిత్యజించిరి. పరిపాలనయంత్రము నిలిచిపోవుస్థితి యేర్పడినది. ఈ యన్నిటియందును సరోజినీదేవి విశ్వరూపమెత్తి పనిచేసినది.

---

# 7. స్వాతంత్ర్యసమరములో పాత్ర

అసహాయోద్యమము కొన్ని వెఱ్ఱితలలు గూడ వేసినది. సామాన్య జనులకు సంయమన ముండదుగదా! వారు విశృంఖలముగఁ గొన్ని యెడల విహరింతురు. అట్టి సన్నివేశ మొకటి 1921 లో జరిగెను. ఆంగ్ల ప్రభువులు మనకుఁ గొన్ని పరిమితములైన యధికారముల నొసఁగిరి. శాసనసభ లేర్పాటు చేయఁబడెను. ఢిల్లీ శాసన సభ 1921 లో నారంభింప వలసి యుండెను. ఈ ప్రారంభోత్సవము నొనర్చుటకింగ్లండునుండి కన్నాట్ ప్రభువు పంచమ జార్జి చక్రవర్తిచేఁ బంపఁబడెను. ఆతఁడు బొంబాయిలో నోడ దిగినాఁడు. మహాత్ముని నాయకత్వమున నసహాయోద్యమము దీవ్రముగ సాఁగుచుండిన దినములవి. ఆంగ్ల ప్రభువు లొసఁగిన యీ సంకుచితాధికారములు ప్రజల కిష్టములేదు. అనేక పౌరులు ఓటు వేయక నిరాకరించిరి. "ఓయి, కన్నాట్ ప్రభువా! నీ పెత్తనము మాకక్కఱలేదు. నీవు తిరిగి పో"మ్మని ప్రజలు కేకలు వేసినారు. మితవాదులు మాత్రము కన్నాట్ ప్రభువు నాహ్వానించిరి. దేశములో నశాంతి చెలరేఁగినది. అక్కడక్కడ లూటీలు, పోలీసులపై రాళ్లు విసరుట, కాల్పులు మొదలగు నల్లరులు జరగెను. గాంధీ యీ పరిణామమును గూర్చి చాల చింతించెను. ప్రజల యుద్రేకము నాఁపుటకై యాతఁడా యల్లరులు జరుగుచున్న ప్రదేశములకు వెళ్ళినాఁడు. మహాత్ముని సరోజిని యనుసరించెను. వారనేక

సభలలో నుపన్యసించిరి. తమ నాయకుల పల్కులు ప్రజలు చెవియొగ్గి వినిరి. శాంతి నెలకొల్పఁబడెను. ప్రభుత్వము శస్త్ర సంపదతో సాధింపలేని విజయమును గాంధీ, సరోజినీ దేవు లుపదేశములతో సాధించిరి.

ఆ సంవత్సరాంతమున కాంగ్రెసు సభ జరుగు దినములు వచ్చెను. ఆ సభల కధ్యక్షుఁడు చిత్తరంజన దాసు. అతఁడును పేరువోసిన దేశభక్తుఁడు. కాని, సమయమునకు సరిగా నాతఁడు జబ్బువడెను. చిత్తరంజన దాసునకు బదులు హాకీం అజ్మల్ ఖాన్ అధ్యక్షుఁడైనాఁడు. ఇతఁడు హిందువుల చేతను, మహమ్మదీయుల చేతను గౌరవింపఁబడిన పెద్ద మనుష్యుఁడు. అజ్మల్ ఖాన్ తన యధ్యక్షోపన్యాసమును జదివి కూర్చున్నాఁడు. చిత్తరంజన దాసుల యుపన్యాస మంతకుముందే తయారై యుండెను. ఆ యుపన్యాసమును వారికి బదులు మరెవ్వరైనను జదువవలెనని ప్రజలు పట్టు వట్టిరి. ప్రజల యభీష్టము నెరవేర్పఁ బడవలెను గదా! చిత్తరంజనుని యుపన్యాసమును జదువవలెనని ప్రజలు సరోజినీదేవినిఁ బ్రార్థించిరి. ఆమె యంగీకరించినది. ఈ సన్నివేశముతోఁ బ్రజల కామెపై నెంత గౌరవ ముండి నదియుఁ దెలియును. ఆ నాఁటికే భారతీయ చిత్తవృత్తుల నామె సంపూర్తిగఁ దనవైపున కాకర్షించికొన్నది.

ఇంతలో మరియొక సన్నివేశము జరగెను. మన భారతీయు లెన్నఁడో యితరదేశములకు వలసవెళ్లినారు.

అట్టి భారతీయులు కొందఱు కెన్యా యందును గలరు. ఈ ప్రదేశము తూర్పు ఆఫ్రికాలో నున్నది. భారతీయులు కష్టపడి పనిచేయువారు గదా! అక్కడికి వలస వెళ్ళిన కొన్ని దినములకే వారు బాగుగ నభివృద్ధికి వచ్చిరి. భూమిని బ్రద్దలుగొట్టి పండించిరి; వ్యాపారులైరి; కాలక్రమమున ధనికులునైరి. ఈ సన్నివేశమును జూచి కొంద ఱాంగ్లులకుఁ గన్నుకుట్టినది. వారిలోఁ గొంద ఱా దేశమునకు వలస వచ్చినారు. వారు భారతీయుల యాదరముతో బాగుపడిరి. యూరోపు దేశస్థుల వ్యాపారమునకు భారతీయులే పెట్టుబడి పెట్టిరి. కాలక్రమమునఁ దెల్లవారు గూడ ధనికులైనారు. వారి కృతఘ్నతయు నారంభమైనది. వారికిని భారతీయులకును వ్యాపారమునఁ బోటీ లేర్పడెను. భారతీయుల నాచోటనుండి వెడలఁగొట్టవలయునని తెల్లవారి దురూహ. తెల్లవారికి బ్రిటిషు ప్రభుత్వముగూడ మద్దతు నిచ్చెను. అచ్చటి భారతీయులకుఁ గష్టములు గలిగించు శాసనములను వా రమలులోఁ బెట్టిరి. తెల్ల, నల్ల యను భేదము లేర్పడఁ జొచ్చెను. అచ్చటి భారతీయుల కీదుర్మార్గము సహింపరానిదై పోయెను. వారు తిరుగఁ బడిరి. వారి తిరుగఁబాటునకు ఇండియాలోని కాంగ్రెసు సంస్థ సహాయమొనర్ప నెంచెను. కెన్యా భాగమునకు భారతదేశమునుండి కాంగ్రెసు పెద్దలు కొందఱు వెళ్ళిరి. వారిలో ముఖ్యురాలు సరోజినీ దేవి.

కెన్యా భారతీయు లామెకు సంతోషముతో స్వాగతము

చెప్పిరి. సరోజినీదేవి వారికి సత్యాగ్రహమును నేర్పెను. అశస్త్రమైన పోరాటములో నున్న బలమును వారనుభవింపఁ జొచ్చిరి. అసహాయోద్యమము, సత్యాగ్రహము వంటి ప్రయత్నము లా దేశమున బహుళముగ సాఁగినవి. జనులు తండోపతండములుగ నా ప్రయత్నమునఁ జేరిరి.

ఇట్టి పరిస్థితులే దక్షిణాఫ్రికాలోఁ గూడ నుండెను. అచటి వారుగూడ సరోజినీదేవియొక్క సాయ మపేక్షించిరి; ఆమెను దమ దేశమునకుఁ బంపవలసినదని కాంగ్రెసునకు వినతి యొనర్చిరి. సరోజినీదేవిని దక్షిణాఫ్రికాకుఁ బోవలసినదని భారతీయ కాంగ్రెసు ఆదేశించినది. ఆ యాదేశము నామె తలధరించెను. కెన్యాలో వలెనే దక్షిణాఫ్రికాయందుఁ గూడ సరోజినీదేవి భారతీయులను సుసంఘటిత మొనర్చినది. దక్షిణాఫ్రికా భారతీయుల కింతకుముందే సత్యాగ్రహోద్యమమునఁ గొంత యనుభవము కద్దు. భారత దేశమునకు రాక ముందు గాంధీమహాత్ముఁడు సత్యాగ్రహము నిచట సాధించెను. వారితప మచ్చట ఫలించినది. జనరల్ స్మట్సు మహాత్మునితో రాయబారములకు దిగెను. ఆత్మశక్తియన నేమో వారి కర్థమైనది. అర్థమగునట్లు గాంధీమహాత్ముఁ డొనర్చెను. సరోజినీదేవి యచటి వారిలో నణఁగియున్న యా సంస్కారమును మఱల రెచ్చఁగొట్టినది. వా రామెయందు స్వాతంత్ర్య దేవతను దర్శించిరి. ఆమె ప్రతిపల్కును వారికి వేదవాక్యమైనది. సరోజినీదేవి యచట సాఫల్యమును జేపట్టి

భారత దేశమునకు మరలివచ్చినది.

ఆసంవత్సరమున నామె కాంగ్రెసుసంస్థ కధ్యక్షురాలయ్యెను. ఆనాఁడు భారతీయు లొసఁగు గౌరవములలో నది యుత్తమోత్తమమైనది. స్వాతంత్ర్యరథము నింతకుముందెందఱో లాగికొనివచ్చిరి. అది కొంతదూరము నడచి వచ్చినది. దాని ఘంటలయొక్క ఘలంఘలధ్వానములకు బ్రిటిషుసామ్రాజ్యహృదయము దద్దఱిల్లెను. ఈసంవత్సరము పగ్గము లీడ్వవలసినభారము సరోజినీదేవిపైఁ బడెను. ఆ కాంగ్రెసుసభలు జరగినది కాన్పూరునందు. కాంగ్రెసు చరిత్రలోఁ దొట్టతొలుత నిట్టిగౌరవము ఆనిబిసెంటునకుఁ దక్కినది. రెండవయామె సరోజినీదేవి. ఆ సభలలో నొక చిత్రము జరగినది. అది యిది.

అంతకుముం దధ్యక్షులెల్లరును దమ యుపన్యాసమును ముందే తయారు చేసికొనెడివారు. అవి ముద్రితముగూడ నయ్యెడిది. దానిని వా రాసభలలోఁ జదువుదురు. అధ్యక్షస్థానమునుండి మాటలాడునపుడు ముందు వెనుక లాలోచింపక యొక పొల్లుమాటయుఁ బలుకరాదని వారి యూహ. శ్రీమతి సరోజినీదేవియు నట్లే తన యుపన్యాసమును దయారు చేసికొన్నది. అది ముద్రింపఁబడికూడ నుండెను. కాని, యామె యా యుపన్యాసమునే చదువ నారంభింపలేదు. తాను బలుకవలసిన విషయముల నన్నిటిని యొక చిన్న పత్రముపైఁ గ్రోడీకరించికొని యనువుగా మాటలాడుటకు

మొదలు నెట్టెను. ఆమె కవయిత్రి. శబ్దము లామెకు జరణ దాస్యమును నెఱపును. భావపుష్పముల కామె హృదయము నందనోద్యానము. నయాగరాజలపాతమువలె నాభావములు తెగదూఁకులు దూఁకును. ఆమె కేమి తక్కువ? ఉపన్యాసము నామె యారంభించెను. వ్రాసికొని వచ్చిన యుపన్యాసములను జదువునపుడు సభ్యులు సాధారణముగ వినుట యరుదు. ముద్రితమైనదిగదా, ఇండ్లలోఁ జదివికొనవచ్చును లెమ్మని వారు ప్రక్కవారితోఁ జిన్న యుపన్యాసముల నారంభింతురు. ఆప్రక్కనున్నవారు దానికి లఘుటీక చేయుదురు. అధ్యక్షుని యుపన్యాసమునకంటెను వీరి గోలలే యెక్కువగును. ఆశుధారగా సరోజినీదేవి మాటలాడుట కారంభించుటతో నీదృశ్యమంతయు మాయమైనది. సభ్యులు చిత్రములవలెఁ గదలక మెదలక వినుచుండిరి. ఆ యుపన్యాసము సాఁగుచున్నంతవఱకు వారీమధ్యమలోకమున లేరు. ఏవో సౌందర్యలోకములలోఁ దిరుగుచుండిరి. ఆమె తన యుపన్యాసమును నిల్పిన వెంటనే 'ఇంతలోనై పోయిన దేమి!' యనిపించినది.

భారతదేశమునందలి బీదలకష్టముల నామె వర్ణించునపుడు శబ్దములలో నుఱుము లుఱిమెను. పల్లెలలోనుండు విద్యాగంధములేని జనులదైన్యము నామె వర్ణించునపుడు శ్రోతలకుఁ గన్నీరు పలపల గాఱినది. సంస్థానాధిపతుల నామె ప్రజలతోఁ జేయి గలుపవలసినదని హెచ్చరించెను. భారత

దేశ మవిభ క్తమని, ఋషుల యాత్మను జీల్పవలదని యామె ఘోషించెను; సరిహద్దులలోనున్న ప్రజలు పడు బాధల నామె వివరించెను. ఆప్రదేశములలో నెప్పుడును సైనికరాజ్యమే. దాని నామె గర్హించినది. భారతీయులలో నానాఁడు సైనికశిక్ష చాలమందికి లేదు. ఈ పిఱికితనము నామె నిందించినది. భారతీయు లెందుకు సైనికశిక్ష నలవరచికొన రాదు? మనదేశము నాంగ్లేయులు రక్షింపవలెనా? ఇది సిగ్గు చేటుగదా! కాంగ్రెసు దళములలో నున్న యువకుల నామె సైనికశిక్ష నభ్యసింపవలసినదిగాఁ గోరెను. గాంధీమహాత్ముని వ్యక్తిత్వము నామె విశదీకరించినది. అతఁడు ప్రాచీన మహర్షులకుఁ బ్రతినిధి. పతితమానవుల నుద్ధరించుటకై యవతరించిన పరమేశ్వరుఁడు మహాత్ముఁడు. ఇట్టి వెన్నియో విషయముల నామె పల్కెను; కాంగ్రెసుసంస్థలో స్త్రీలశాఖ యొకటి యేర్పడవలెనని ప్రతిపాదించెను. అపుడపుడు భారతదేశపు నాయకులు గొందఱితర దేశములకుఁ బోయి తమకష్టము లాజనులకు నచ్చఁజెప్పవలెనని యామె హెచ్చరించెను. ఇతర దేశములకు వలసవెళ్లిన భారతీయులను మనము మఱచి పోరాదనియు, అపుడపుడు దేశనాయకు లాప్రదేశములకు వెళ్లి యచ్చటఁ గష్టపడుచున్నసోదరులకు ధైర్యప్రదాన మొనర్చిరావలెననికూడ నామె యాదేశించినది.

సరోజినీదేవి యొసఁగిన యుపన్యాస మొక యింద్రజాలము. ఆనాఁ డాయుపన్యాసమును విన్నపెద్దలలోఁ

గొందఱు నేఁటికిని ఆమె వాగ్ధాటిని కథలుగాఁ జెప్పికొను చుందురు. తాము రచించిన కాంగ్రెసు చరిత్రలో నాఁటి సరోజినీదేవి యుపన్యాసమును శ్రీపట్టాభి సీతారామయ్యగా రెంతయో పొగడిరి. అట్టి రసవత్తరమైన యుపన్యాసము నే యధ్యక్షుఁడుగాని యంతకుముం దొసఁగినదే లేదఁట!!

అమెరికా దేశస్థులకుఁ జాలదినములనుండి యొక యాసక్తి యుండెను. భారతదేశముననున్న సామాజిక, రాజకీయపరిస్థితులనుగూర్చి సత్యమైన విషయములను దెలిసి కొనవలయుననునది వారి తలఁపు. ప్రతిసంవత్సరమును మహాత్మునకు వా రాహ్వానము లంపుచుండిరి. కాని, యాత నికిఁ బోవుటకు వీలుచిక్కుటయే లేదు. భారతదేశమున బ్రహ్మాండమైన యుద్యమము నడచుచున్నది. ఇఁకఁ దా నెట్లు పోఁగలఁడు? సేనాధిపతి లేనిది సైన్యము లెట్లుపోరును?

అది 1928-వ సంవత్సరము. అపుడు భారతనాయకులు సరోజినీదేవిని అమెరికాకుఁ బంప నిశ్చయించికొన్నారు. అప్పు డట్టియవసర మేమివచ్చినది? ఆయవసర మిది. అమెరికా దేశమున మేయో అను నొకయువతి యుండెను. ఆమె గ్రంథ కర్త్రి. మేయో భారతదేశమునకు వచ్చెను. ఆమె కొంత కాల మిచటఁ దిరిగిపోయినది. ఆమెదృష్టి విచిత్రమైనది. ప్రతివిషయమునను దోషమును గాంచుటయే యామె కలవా టున్నట్లున్నది. భారతదేశమునుండి యమెరికాకుఁ బోయి నదే తడవు మేయో మనదేశముపై నొక గ్రంథమును

వ్రాసినది. ఆగ్రంథము తప్పుల తెడక. మన ప్రతియాచారము నామెకు విభిన్నముగ నే యర్థమైనది. ఆమె మనది పశుజీవిత మనెను; మనము విద్యాహీనులమని విమర్శించెను; మన జాతి నీతి హీన మనియు చెప్పిపొడిచెను. ఇట్టి యసంబద్ధములైన విషయము లామె యెన్నియో వ్రాసినది. స్వాతంత్ర్యమునకై మనమొనర్చుపోరాటమునుగూడ నామె యధిక్షేపించినది. ఆమెదృష్టిలో మన దేశము స్వాతంత్ర్యమున కనర్హము. భారత దేశముయొక్క సత్యదీక్ష, యహింస మున్నగునవన్నియు బూటకములని యామె వెక్కిరించినది. ఈగ్రంథ మమెరికాఖండమున నొక పెద్దయలజడిని లేపెను. వీనికి సరియైన సమాధానము నీయవలసిన బాధ్యత భారత దేశముపై నుండెను. ఆ పనిని సాధించుటకై సరోజినీదేవి అమెరికాకు వెళ్లెను. ఆమె యచట ననేకపర్యాయము లుపన్యసించెను; మేయో వ్రాతలలోని పొరపాటుల నామె వివరించి చెప్పెను; భారత దేశసామాజికపరిస్థితులను వింగడించి వచించెను; సత్యాహింసలలోని యంతరార్థమును, మన దేశమున కాంటిపైనున్న విశ్వాసమును నొక్కి చెప్పెను. ఆతర్కకౌశల మప్రతిహతమైనది. మేయో వ్రాసిన గ్రంథము సరోజినీదేవిచే దునాతునుకలుగ ఖండింపఁబడెను. అమెరికా దేశస్థులు గన్నులు దెఱచిరి. మేయో గ్రంథము చెత్తబుట్టలలోని కెక్కినది. అమెరికా దేశస్థులకు భారత దేశముపై గౌరవ మినుమడించెను. ఆమె

స్వదేశమునకు మఱలివచ్చెను.

వచ్చినదేతడవు భారతదేశమున మహోద్యమము సాఁగ నారంభించెను. గాంధీమహాత్ముఁడు పాలకులతోఁ గడపటియుద్ధము సాఁగింతమనుకొన్నాఁడు. ఆతనిదృష్టి యత్యంతనిశితమైనది. సామాన్యజనుల కల్పాల్పముగఁ గను పడు నొకసూత్రము నాతఁడు గ్రహించును; అది మహా కార్యముగ సాధించును. తొలుత జనులు "ఇంత చిన్న విష యముపై మహాత్మున కింతటిలక్ష్య మెందుకో? ఇతఁడేమి పిచ్చి వాఁడా?" యని పరిహసింప నారంభింతురు. తరువాత నిదా నముగ నాలోచించుకొని సత్యమును గమనింపవలసినవారు సామాన్యప్రజలేకాని మహాత్ముఁడు కాఁడు. అప్పుడు జనులు పశ్చాత్తాపపడుదురు. ఇట్టిసన్నివేశమే యతఁ డారంభించిన యుప్పుసత్యాగ్రహము. ఉప్పునకై సత్యాగ్రహ మన్నప్పు డాతని నందఱుఁ బరిహసించిరి. లవణ మల్పాల్పపదార్థము. దానిపై నింతటి పట్టుదలయేమి? కాని, నిజమున కాలోచించి నచో నుప్పుపన్నుతో వచ్చునంతటి యాదాయము పాలకులకు మఱిదేనితోను గిట్టుట లేదఁట! దానినిఁ బడఁగొట్టవలెనని యాతని యిచ్ఛ. ఇఁక నుప్పు ప్రతిమానవునకును గావల సినదే! పశువులకుఁగూడ నిది యావశ్యకమే! ఉప్పును వాడుటలో ధనికదరిద్రభేదమే లేదు. మహాత్మునకు ధనిక దరిద్రభేదమే లేదుకదా! అతఁడు మానవులకై పోరాడెను. పశువులకుఁగూడ నుప్పు కావలెను గనుక వానిపైఁగూడ

బ్రిటిషువారు పన్ను విధించినట్లే యని మహాత్ముఁడు పరి హసించెను. ఈయల్పపదార్థము వెనుక నింతతర్క మణఁగి యుండెను. తర్వాత లోక మీావిషయమును గుర్తించెను. లవణశాసనోల్లంఘన మొనర్పవలెనని సత్యాగ్రహవీరుల కాతఁ డాదేశించినాఁడు. సత్యాగ్రహు లుప్పు దయారు చేయ మొదలిడిరి. వారు తయారుచేయులవణము యొక్క పరిమితి యెంత యనుప్రశ్న కచ్చటఁ జోటులేదు. ఉప్పుపై పన్ను విధించుట యన్యాయమని తెల్పుటయే యాక్రియలోని యంతరార్థము. దేశమునం దెల్ల కడలను జను లీయుద్యమ మునఁ బాల్గొనిరి. దీని నరికట్టుటకు సాధన మేమి? పరిపాల కులకుఁ దోఁచినయుపాయ మొక్కటే! వారు వరుసగా దేశ నాయకులఁ బట్టి బంధించిరి. కారాగారములు సత్యాగ్రహు లతో నిండిపోయెను. ఆయుద్యమమున సరోజినీ దేవియుఁ బాల్గొన్నది. ఆమెను గాంచి యుత్సాహము చెలరేఁగిన స్త్రీ లెందఱో యుప్పుసత్యాగ్రహమునఁ గారాగారములకు వెళ్లిరి. ఆంగ్లేయపరిపాలకులకుల యన్యాయ మీాసంఘటనతోఁ బ్రపంచమునకుఁ జక్కఁగా నర్థమైనది. దినదినమును దండోప తండములుగా సత్యాగ్రహులు చెఱసాలలలోనికి వచ్చుచుండిరి. వీరినందఱిని బంధించుటకుఁ గారాగారములు చాలకపోయి నవి. వీరి నేమి యొనర్పవలెను? ఇది పరిపాలకులకుఁ బెద్ద సమస్యయై కూర్చున్నది. కొందఱిని వారు శరీరము పేటు దిరుగునట్లుఁ గొట్టి విడుచుచుండిరి; స్త్రీలను లారీలలో

నెక్కించికొనిపోయి దుర్గమారణ్యములలో వదలి వెళ్లు చుండిరి. వారొనర్చిన మానభంగములకు లెక్కలేదు. అయిననేమి? తాడితులైన సత్యాగ్రహులు మరల శాసనోల్లంఘనమునకుఁ దయారయ్యేడివారు. బాధితలైన స్త్రీలు ద్విగుణీకృతోత్సాహముతో వెంటనే సత్యాగ్రహమున కారంభించెడువారు; తమ్ముఁ జెఱసాలలో బంధించువఱకును బ్రయత్నములను వదలెడువారు గారు. బ్రిటిషుపరిపాలకుల కీసమస్య పెద్దచీకాకును గల్గించినది. అట్లు కలుగవలెననియే మహాత్ముని యాశయము. ఈసందర్భమున సరోజినీదేవిని యెరవాడజైలులో బంధించియుండిరి. సత్యాగ్రహుల కీకారావాసముతో గౌరవమే పెరిఁగినది. కారావాస మవమానకర మన్నదృష్టి జనులలోఁ బోయినది. సత్యాగ్రహులు దొంగలుగారు; దుండగులు గారు. వారన్యాయమును న్యాయముతో నెదిరించిన మనీషులు; స్వార్థమును విసర్జించిన త్యాగులు; దేశమునకు స్వాతంత్ర్యగీతి వినిపించు దివ్యగాయకులు. ఈ భావములు ప్రజలలోఁ బెరిఁగినవి. ఆసత్యాగ్రహుల కూరూర సన్మానములు జరగెను. పోలీసులచేఁ గొట్టఁబడిన సత్యాగ్రహులకుఁ బ్రజ లుపచారము లొనర్చిరి; వారి చిత్రముల నిండ్లయం దుంచికొని పూజింపఁజొచ్చిరి. భారతజాతియొక్క యాత్మ యిదే! ఒక మనుష్యునిలో నసామాన్యమైన యేగుణము గన్పడినను వా రాతని నవతారపురుషుఁ డందురు: అతనిని బూజింతురు. ఆగుణములు

దమకు రావలెనని ప్రార్థించి ప్రయత్నింతురు. ఏ గొప్పపని చేసినవాఁడైనను మనకు దేవత. ఈరహస్య మితరజాతులకుఁ దెలియదు. దేవత లెందఱని వారు మనలను బరిహసింతురు. మన దేవతలలో సామాన్యముగ నెందఱో మానవులు. మానవులై యతిమానవగుణములను సాధించినవారన్న మాట! పరగుణగ్రహణమునందు భారతజాతికిఁ గల యీ యుదారత యితరులకు లేదు. వారు దానిని నాగరికత యందురు. మనఃపరిపాకముతో సంబంధములేని విడంబనయే నాగరికత మైనచో వారిది నాగరికతయే !!

పరిపాలకుల కేమియుఁ దోఁచలేదంటిమి. వారి కారాగారములన్నియు సత్యాగ్రహులతో నిండిపోయినవి. పైఁగా నీఖైదీలకు దినబత్తె మొక యదనపుఖర్చు. కాంగ్రెసు వారితో నెట్లయిన నొక యొడంబడిక గుదుర్చుకొనవలెనని వారి లోపలియాశ. కాని, పైకి నీవిషయమును స్పష్టముగఁ జెప్పరు. అట్లు చెప్పరాదు. అది తమ గౌరవమును దగ్గించికొనుట! రాజకీయములలోని కూటనీతిలో నిది ప్రథమ సూత్రము.

వా రెంతకాలమని యోర్చికొనఁగలరు? దినదినమును సముద్రతరంగములవలె సత్యాగ్రహు లెక్కువచ్చుచున్నారు. కడకు వారికిఁ గొండపైనుండి దిగక తప్పలేదు. నాఁటి భారతదేశరాజప్రతినిధి ఇర్విన్ ప్రభువు. అతఁడు గాంధీ మహాత్ముని రాయబారముల కాహ్వానించినాఁడు.

ఆసమయముననే బ్రిటిషు పరిపాలకులు లండను నగరమందు రౌండుటేబిలు సభ నేర్పాటు చేసినారు; దానికి భారతదేశమునుండి యభ్యర్థుల నాహ్వానించిరి. ఆహూతులలో వివిధ సంఘములకు, వివిధ భావములకుఁ బ్రతినిధులైనవారెందఱో కలరు. వారిలోఁ గొందఱప్రసిద్ధులు; కొందఱు ప్రసిద్ధులు. అప్రసిద్ధుల నీ యాహ్వానముతో బ్రిటిషుజాతి ప్రసిద్ధులఁ జేయఁదలఁచెను. ఈ సభ నేర్పాటుచేయుటలో భారతదేశ క్షేమచింతకంటెను, నపకార చింతయే యెక్కువగ నుండెను. గాంధీమహాత్ముని సత్యాగ్రహముతో నితర దేశములలో బ్రిటిషువారి కపకీర్తి పెరిఁగిపోయినది. దానినిఁ దగ్గించి కొనవలెనని వారియాశ. కాంగ్రెసు సంస్థ భారతదేశమున కేకైక ప్రతినిధినని చాటుకొన్నది. అది కాదనియు, ఇండియాలో మిగిలిన వెన్నియో పక్షములు గలవనియుఁ బ్రపంచమునకు ఋజువుచేయవలెనని వారి రెండవ యెత్తు. విభిన్న భావములు గల వ్యక్తుల నొక్కచోటఁ జేర్చినప్పుడు వారిలో సహజముగ నభిప్రాయ భేదములు గలుగును. కలుగక పోయినను, పరిపాలకులు గల్గింతురు. వారి కూటనీతి యట్టిది. ఈ రీతిగ నభిప్రాయ భేదములు గలిగినప్పుడు "మీలో మీకు నేకవాక్యత లేదుగనుక స్వాతంత్ర్యమునకు మీ రర్హులు గా"రని వట్టి చేతులతోఁ దిరిగి పంపవలె నని కూడ వారి యాకాంక్ష. ఈ కలఁతలను బ్రపంచమునకుఁ జాటి చెప్పినచోఁ దమ బాధ్యత దీఱిపోవుననియుఁ బాలకు లెంచిరి.

వీరి యీ నాటక మంతయు రెండు పిల్లులు కొట్లాడినప్పుడు కోఁతి చేసిన తీర్పువంటిది. కడ కీ మహాసభయొక్క ఫలిత మంతే యయ్యెను.

ఈసభ నేర్పాటుసేయుటలోని కూటనీతి భారత నాయకుల కర్థముగాక పోలేదు. ఆ సభలకు గాంధీ మహాత్ముని఼ బోవలదని వారు ప్రార్థించిరి. బ్రిటిషువా రాతనిని సభల కాహ్వానించినారు. మహాత్ముఁ డాసభలకు వెళ్ళరాదని భారతదేశము తీవ్ర నిరసనను దెల్పినది. కాని, ఆతఁడు పరమ శాంతమూర్తి. శత్రువులను బలముతో సాధింపక సద్గుణములతో వశీకరించి కొనవలెనని యీ మహర్షి తపస్సు. అందుకై యాతఁడు లండను నగరమునకుఁ బ్రయాణము కట్టనే కట్టెను. సరోజినీదేవిగూడ యీ సభల కాహ్వానింపఁ బడినది. కాని, యీమె కాంగ్రెసు పక్షము నాహ్వానితురాలు గాదు; భారతదేశ స్త్రీల ప్రతినిధియఁట!!

ఆ సభలలో బ్రిటిషు పరిపాలకులు దమ పాత్రను జక్కఁగనే నిర్వహించినారు. పూర్ణస్వరాజ్యము గావలెనని కాంగ్రెసు గోరెను. వారి మాటల నధికారులు పెడచెవిని బెట్టిరి. ఆ మహా సభలలో నొక విచిత్రమైన విషయము జరగెను. నాఁడు మన దేశమునకు సార్వభౌముఁడు పంచమ జార్జి చక్రవర్తిగదా! ఆంగ్లేయాధికారులు గాంధీమహాత్మున కాయనతోఁ బరిచయ మొనర్చుటకై యొక సన్నివేశ మేర్పాటు చేసిరి. మహాత్ముఁడు చక్రవర్తి భవనమున

కాహ్వానింపఁ బడినాఁడు. ఇతర వ్యక్తులైనచో నా సన్నివేశ
మున కెంత యుప్పొంగియుండురో! ఆ మహాయోగి మనస్సున
నావంతమార్పు లేదు. ఆతని దృష్టిలో సకల సామ్రాజ్య
చక్రవర్తికిని, సామాన్య మానవునికిని భేదమేమున్నది గనుక!
చక్రవర్తి సందర్శనమునకై పోవువారు ప్రత్యేకములైన
యుడుపులు ధరింపవలసి యుండెను. మన మహాత్ముఁ డర్ధ
నగ్నుఁడు గదా! ఆయన ధరించునది మోకాళ్ళపైకిఁ బంచె.
ఆయన కప్పుకొన్న దొకచిన్నవస్త్రము. చక్రవర్తి సందర్శన
మున కీ వేషము మార్చికొని పోవలసినదని యధికారు లతని
నెచ్చరించినారు. అతఁడు నా కాసాగ్యభాగ్యముని దర్శనమే
వలదనెను. ఎంతటి విచిత్ర పురుషుఁ డాయన! పరిపాలకుల
కిఁక విధిలేకపోయెను. ఆయన యట్లే వచ్చుటకు సమ్మతించిరి.
మహాత్మునిది భగీరథుని పట్టుదల. దానినిఁ జలింపఁ జేయుటకు
బ్రహ్మాదులకుఁ దరముగాదు. చక్రవర్తి భవనమున విందొకటి
తయారు చేసినారు. దానిలో నెన్నో యపూర్వ పదార్థములు.
వానిలోఁ గొన్ని మాంస మిశ్రితములు. మహాత్ముఁడు
మాంసమును భుజింపఁడు. అతని యాహార నియమ మత్యంత
కఠోరమైనది. ఆవిందులో నాతఁడు పండ్లను మాత్రమే
భక్షించెనఁట! ఎంతటి స్వాతంత్ర్యము! ఆతఁడు మన కనుల
యెదుటనే పుట్టెను; మనతోనే కలిసి మెలిసి బ్రదికెను;
మన యెదుటనే మాయమయ్యెను. ఈమహాఁడును మన
పాలిటికి స్వప్నములే యయ్యెను. ఆయన సాధించి యిచ్చి

పోయిన స్వాతంత్ర్యమును మాత్ర మనుభవించు చున్నాము. ఆతని గుణములను మన మేమి నేర్చికొంటిమి? ప్రపంచ మెప్పటికి నింతే. మహాత్ములు వత్తురు, పోదురు. వారు సాధించిన ఫలములను మన మనుభవింతుము. మన మనుసరింపని దొక్కటే! వారి యాదేశము.

చక్రవర్తితో నేర్పాటు చేయఁబడిన యీ సన్నివేశమున మహాత్ముఁడు ప్రదర్శించిన యాత్మశక్తి ప్రపంచమునే దిగ్భ్రాంతి గొలిపెను. మహాత్ముని గొప్పదనమును దగ్గింపవలెనని పాలకు లాతని లండనున కాహ్వానించిరి. కాని, యది ద్విగుణీకృతమైనది. దైవము సేయుచేత లిట్లే యుండును. రౌండు టేబిలు మహాసభ వ్యర్థమైపోయెను. దీనితో హిందూదేశమునకుఁ గలిగిన ప్రయోజనము సర్వ శూన్యము. ఆ సభకు వెళ్ళిన కొందఱు పెద్దలు, భారతీయులే – గాంధీమహాత్ముని ధిక్కరించిరి. వా రాంగ్ల పరిపాలకుల మిత్రులు; వారి చనవుతోఁ బదవులను సంపాదించికొనఁ దలఁచినవారు; ఇంకను బెద్ద యుద్యోగములకై యెక్కుపెట్టిన శుభాకాంక్షులు. వారి దృష్టిలోఁ 'దన చిన్నిపొట్టకు శ్రీరామ రక్ష.' ఇతరుల కష్ట సుఖములతో వారికిఁ బని లేదు. స్వార్థ త్యాగము, పుణ్య పాపములు, పురుషార్థము, సత్య ధర్మములు–ఇవన్నియు నా మనుష్యులకుఁ బుస్తకముల మాటలు. వారందఱేకమై గాంధీ మహాత్ము నెదిరించినారు. ఇఁక మహాత్ముఁడొక్కఁ డేమి సేయును? మహాత్ముని యీ యసహాయస్థితి పరిపాల

కుల కెంతో సంతోషకారక మయ్యెను. వా రందులకే కాచియున్నారుగదా! కాని, యీ ప్రయత్నములో వా రను కొన్నంత ప్రయోజనము మాత్రము గలుగలేదు. సాముదాయికముగ నపజయమే గాంధీ మహాత్మునకు సిద్ధించినను వైయక్తికముగ నీ సన్నివేశముతో నాతఁ డెంతయో గొప్పవాఁడుగ భాసించినాఁడు. పాశ్చాత్యుల కంతకుముందు మహాత్ముని గుఱించి యొక క్షుణ్ణమైన భావము లేదు. అతని నొక రాజకీయవాదిగనే వారెంచిరి. వారి కుండఁదగిన నక్కజిత్తు లన్నియు మహాత్మునకుఁగూడ నుండునని వారి తలఁపు. ఆతఁడు రాజకీయములలోఁ దూర్చిన క్రొత్త సిద్ధాంతము వారి కర్థముగాలేదు. అది పాశ్చాత్యులకుఁ జీకాకును గల్గించినది. సత్యము, అహింస, ధర్మము – ఇవి కేవలము పరలోకమునకు సంబంధించిన సూత్రములు. రాజకీయ మైహికము. దీనికిని దానికిని బొత్తు గలియుటెట్లు? అర్ధ నగ్నుఁడైన యీ వృద్ధుఁడు పారలౌకికములైన ధర్మ సూత్రములను రాజకీయములతోఁ బొత్తుగలిపి వానిని సదమద మొనర్చుచున్నాఁడని పాశ్చాత్యు లనేకులు దలఁచుచుండిరి. పలుచోట్ల నాతని బరిహసించిన వారుగూడ లేకపోలేదు. తొలుత, వారి కండ్లకు వామనుఁడుగఁ గనుపడిన యీ మూర్తి త్రివిక్రమావతారమూర్తిగఁ బెరిఁగినాఁడు. దివ్య వేణువుతోఁ బ్రపంచమును ముగ్ధమొనర్చిన శ్రీ కృష్ణ పరమాత్ముని వలె నేఁడీ యర్ధ నగ్నుఁడైన యోగి

దన సూక్తి వేణువుతోఁ బ్రపంచమును సమ్మోహన మొనర్చుచున్నాఁడు.

సుమారు సహస్రాబ్దములక్రిందట యూరోపు దేశమున జీససు జన్మించెను. అతఁడు బోధించిన వాక్కులే వారికి ధర్మగ్రంథములు. ఆతని వాక్యములే కాని, యాతనిఁ జూచిన వారు లేరు. నేఁడు గాంధీమహాత్మునిలోఁ బాశ్చాత్యులు జీససుయొక్క దివ్యాత్మను దర్శించిరి. ఒకనాఁడు దుర్యోధన చక్రవర్తి రాజకీయసభ నేర్పాటుచేసెను. ఆసభలో సాక్షాత్కరించినది శ్రీకృష్ణపరమాత్ముఁడు. అతనిని వాఁడు గట్టఁ బ్రయత్నించి విఫలుఁడైనాఁడు. కృష్ణపరమాత్ముఁడు విశ్వరూపమును జూపెను. నేఁడు గాంధీమహాత్మునకు జరగినది గూడ నదియే సన్నివేశము. బ్రిటిషుపరిపాలకు లాతని నవమానపఱపనెంచిరి. భారతదేశమునందే ద్రోహులను గల్పించి యాతనిపైకిఁ గవ్వించిరి. కాని, పరిణామమేమైనది? మహాత్ముఁడు దన విశ్వరూపము నగపరచెను. పాశ్చాత్య ప్రపంచము లాతనియందు జీససును దర్శించినవి.

వట్టిచేతులతో మహాత్ముఁడు వెనుకకు వచ్చినాఁడు. ఆతనివెంటనే యాతని తోడుసీడ సరోజినియుఁ దిరిగివచ్చినది. దేశమున నడుగుపెట్టినదేతడవు వారి నొక గొప్ప సంకట మెదుర్కొనెను. అది మోతీలాల్ నెహూౄ మరణము. ఇతఁడు మన దేశసర్వస్వమైన జవహర్‌లాల్‌ను గడుపారఁ గన్నతండ్రి; అలహాబాదునఁ బేరుమోసిన న్యాయ

వాది. న్యాయవాదిగ నాతనికీర్తి హిమాలయమునుండి సేతువువఱకు వ్యాపించెను. అనేక పాశ్చాత్యులుగూడ నాతనిని మన్నించుచుండిరి. అతఁడు సంపాదించిన, ఖర్చు పెట్టిన ధనమునకు మితిలేదు. మోతీలాల్ నిర్ణయము లెప్పుడును జలనములేనివి. అతఁడు వట్టిమాటలమారి గాఁడు; క్రియాశూరుఁడు. గాంధీమహాత్మున కాతఁడు రెండవ ప్రాణము. వారికిఁ బరస్పర మన్నదమ్ములవంటి ప్రీతి. అతఁడు మరణించుటతోఁ గాంగ్రెసుసంస్థకుఁ గలిగిన దెబ్బ సామాన్యమైనదిగాదు. ముఖ్యముగ - మహాత్ముని హృదయమున కది తీఱనిగాయ మయ్యెను. కాని, ఆ తపస్వి యన్నిదుఃఖముల వలెనే దానిని సహించెను.

ప్రభుత్వమునకును, కాంగ్రెసునకును దీవ్రవిభేదములు పెరిఁగినవి. అడుగడుగునను బాలకులు ప్రతిజ్ఞాభంగ మొనర్చుచువచ్చిరి; పొలములపైఁ బన్నులు తగ్గించెదమనిరి; ఆపని చేయలేదు; ఇంకను, ఇతరములపైఁ బన్నులనుగూడఁ దీసివేయుదుమని వాగ్దానమొసఁగిరి; ఆవాక్యముగూడ గుండేటికొమ్మయినది. మహాత్మునకుఁ దోఁచుట యొకటే మార్గము; అతఁడు నమ్మిన యాయుధ మొకటే-అది సత్యాగ్రహదీక్ష. మరల దేశమునఁ బోరాట మారంభమయ్యెను. ఆంగ్లేయులు ప్రాఁతపాటనే పాడిరి; దేశనాయకులను వారు వరుసగ బంధింపఁజొచ్చిరి. మఱలఁ జెఱసాలలు నిండినవి. సరోజినీదేవియుఁ గారాగారమున కేఁగినది. ఇంతలో భారత

దేశమున నొక చిత్రము జరగెను. హిందూదేశమున స్వతంత్రరాజు లున్నారు. వారికి సంబంధించి కొన్ని రాజ్యములు. ఈ రాజులు గొన్ని నూఱులకుందురు. వీరు తమ భూభాగములపైఁ బూర్ణాధికారులు. బ్రిటిషుప్రభుత్వ మెప్పుడును వీరి నిరంకుశప్రభుత్వమునకు వత్తాసి. వీరిపై నీఁగ వ్రాలిన నది ముందుకు దూఁకును. స్వదేశరాజులుగూడ బ్రిటిషువారికి శరణాగతులు. వీరికి వారిపై, రామునిపై విభీషణున కున్నంతభక్తి. ఈస్వదేశరాజు లొనర్చిన దేశద్రోహములకు, దురాచారములకు మితిలేదు. పరదాస్యము నవమానముగ వారు భావింపలేదు. ఆంగ్లేయులను మెప్పించుటకు వా రేపనినైన నిర్వర్తించుచుండిరి. బ్రిటిషుపరిపాలకులు కాంగ్రెసును దేశద్రోహసంస్థయన్నారు. స్వదేశరాజులావాక్యముల కూఁకొట్టిరి. నాఁటినుండి వీరును దేశనాయకులపై నిప్పులుచెరుగుట కారంభించినారు. ఈయున్మాదముతో వారు ప్రజల కాంగ్లేయులకంటెను నెక్కువ కీడులు గావింప దొరఁకొనిరి. ఆంగ్లేయులు దేశనాయకులను జైళ్లలో మాత్రమే బంధించిరి; వారిని హిందూదేశము వదలిపొమ్మని దేశబహిష్కృతులను గావింపలేదు. స్వదేశరాజు లాపనికిఁ గూడఁ బూనుకొన్నారు. దేశనాయకులను వీరు దమ రాజ్యములనుండి వెడలఁగొట్టిరి.

శ్రీమతి సరోజినీదేవి హైదరాబాదు సంస్థానమునకుఁ జెందినది. అఘోరనాథుఁడు హైదరాబాదులోఁ గొలు

వానర్చుచుండెనని చెప్పితిమి గదా! నిజాము సరోజినీదేవి కవిత్వమును జదివి యొకనాఁడు ముగ్ధుఁడయ్యెననియుఁ జెప్పితిమి. ఆగౌరవ మాతని కిప్పుడు సరోజినీదేవిపై లేదు. ఆమె యాతనిదృష్టిలో దేశద్రోహమునకుఁ బూనుకొన్న వ్యక్తి. హైదరాబాదు నిజాము సరోజినీదేవిని దేశబహిష్కృతురాలిని గావించినాఁడు: అనఁగా నామె నిజామురాజ్యమునఁ బ్రవేశింపరాదన్నమాట!

హైదరాబాదు నగరము సరోజినీదేవి కెన్నియేండ్ల నుండియో పరిచయమైనది. ఆమె తన బాల్యమునంతయు నచటనే కడపెను. సీమలో విద్యాభ్యాసమును ముగించి సరోజినీదేవి తరలివచ్చినది హైదరాబాదునకు. తన భర్తయా నగరముననే యుండెను. తాను గృహిణియై వెలసినదియు, సంతానమును గన్నదియు నా యూరనే. కడకాయూరే తాను బ్రవేశింపరానిదయ్యెను. ఇందుకుఁ గారణము? నైజాము పెదవులనుండి వెడలిన యొక వాక్యము. ఇదియే యానాఁటి స్వదేశ పరిపాలకుల నిరంకుశత్వమునకు గుఱుతు. ఇంతకు నామె యొనరించిన ద్రోహము? దేశస్వాతంత్ర్యమును గోరుట! ఈ ధర్మము నిజాము దృష్టిలో నధర్మమయ్యెను. నిరంకుశుల పరిపాలన మిట్లే యుండును.

సరోజినీదేవి చెఱసాలకు వెళ్లెనని తెలిపితిమి. కారాగృహమున నామె యశాంతిని బొందలేదు. ఆ జీవితము నామె యెంతయో యుత్సాహముతోఁ గడపినది. కష్టముల

యందు నప్పటి సరోజినీ దేవికిం జిన్ననాంటనుండి యలవాటు. పరిపాలకుల దుర్మార్గమున నామె నవ్వెను. అదృష్టము దనపైం గ్రీడించుచున్న విధి విలాసముల నామె చిఱునవ్వు ధరించెను. ఒకానొకసారి యామె కారాగారాధికారులకుం దన్నింకను జైలులోనే యుంపవలసినదని వినతిపత్ర మంపి కొన్నదంట! ఆ విచిత్రమైన సన్నివేశ మిది. ఆమె జైలులో నున్నప్పుడు తన గది కెదురుగ నొక తోంటను బెంచినది. దానిలో నన్నియుం బూలచెట్లు. ప్రతి దినమును సరోజినీ దేవి తన చేతులార వానికి నీరు వోసినది. అప్పుడప్పుడే చెట్లెదిగి వచ్చుచుండెను. ఒకటి రెండు మొగ్గలు నయనోల్లాసముగ నా తీవెలలోం గన్పించుచుండినవి. సుమా రొకవారము దినములలో నాచెట్లెదిగి వచ్చి పూలు పూయునని యామె యూహించెను. కన్న బిడ్డలవలెం బెంచిన యా లతలు పూతకు వచ్చినపుడు చూచి సంతోషింపవలెనని యామె యాశ. కాని, అంతలోనే యామెకు శిక్షాపూర్తియైనది. ఇంక జైలునుండి వెడలవలయునని యధికారు లాజ్ఞాపించిరి. అప్పు డామె దన్నొక యెనిమిది దినములపాటు కారాగారముననే యుండనివ్వవలెనని యధికారులకు వినతి యొనర్చినది. వారికి దిక్కు దోంచలేదు. అపరాధు లట్లు చెప్పుట కిదియే మొదటిసారి. సాధారణముగ దోషియైనవాం డెల్లవాండును "ఎప్పుడీ కారాగారవాసము ముగియునో" అని యా దినము నకై నిరీక్షించు చుండును. ఈమె యట్లుగాక, తన్నక్కడనే

యుండనిమ్మనుచున్నది! సరోజినీదేవి చిత్తవృత్తి యట్టిది!!

ఎట్టి నివాసమునైన నామె సుఖకరముగ మార్చుకొనఁగలదు. ఎట్టి కష్టమునైన నామె చిఱునవ్వుతో ననుభవింపఁగలదు. ఆమె జీవనమే పూవులతోఁ బత్తులతో. ఇట్టి చిత్తవృత్తిగల మానవులు ధన్యులు గదా! వారిని గారాగారములలో బంధింపలేరు. కష్టములు వారిని గ్రుంగఁదీయలేవు. వారు నిజమైన వేదాంతులు. వేదాంత మనుభవశాస్త్రము. ఒక విషయమును బుద్ధితో నాకళించుట వేఱు; దానిని ప్రవర్తనమున సాధించుట వేఱు. అనేక వేదాంతులు గొప్ప గొప్ప విషయముల నెత్తి యుపన్యాసముల నొసఁగుచుందురు. కాని, వారు గంభీరముగఁ బ్రసంగించు విషయములో నూఱింట నొకపాలేని యనుష్ఠానమునఁ గనుపడదు. అనుష్ఠానము లేని వేదాంతము జీవరహితమైన శరీరము వంటిది. ఇంతటి తర్కము సామాన్యుల కుండదు. వాక్చాతుర్యము గల వేదాంతులను గని సామాన్యులు వారిచుట్టును జేరుదురు. పూజలు, పురస్కారములు మొదలగును. శిష్యుల సేవలకుఁ గొదవ యుండదు. వేదాంతికి భోజనముతోఁ గడుపు బరువెక్కునే కాని యతని యనుష్ఠానము సర్వశూన్యము. మహాత్ముఁడట్టి వాఁడుగాఁడు. అతఁడు బ్రహ్మర్షి. అతని ప్రతిసూక్తియు ననుష్ఠానమే. అతని యడుగుల నిల్చిన సరోజినీదేవియు ననుష్ఠాన స్వరూపమే! ఇట్టివారే నిజమైన వేదాంతులు.

ఆమె యెన్నియోసారులు కారాగారమునకు వెళ్ళినది. ప్రతిసారియు నామె చెఱనుండి చిఱునవ్వులతోనే గడ్డకు వచ్చినది; మఱల మందహాసముతోనే యందుః బ్రవేశించినది. పైపైని యలము కొనుచున్న కష్టములలో నొక్కసారియు నామె నిట్టూర్చినది లేదు. అవిరామముగ నెదుర్కొనుచున్న కష్టములను జూచి నవ్వినది. సరోజినీదేవి యన్నచో దేశమున కెంతయో గౌరవము. ఆమెయొక్క పలుకు వారికి వేదాక్షరమువలెఁ బనిచేసినది. ఆమె కవితాహృదయము దేశమును రసతరంగములపై నోలలాడించినది. అట్టివారు కాలమున నెప్పుడో పుట్టెదరు.

కాలము గడచెను. కాంగ్రెసు గావించిన పరిశ్రమలు ఫలించునట్లు దోఁపలేదు. వారి యడుగడుగునను కాఱు మేఘము లావరించుకొనుచున్నవి. పరిపాలకుల దారుణ చర్యలు దిన దినమును మితిమీఱి పోవుచున్నవి. వీని యన్నిటి కంటె దురదృష్ట కరములైన విషయములు రాజకీయములలో నెదిగి వచ్చుచుండెను. వానిలో నొక్కటి మహమ్మదీయుల వేఱుపాటు.

శతాబ్దముల తరబడిగా హిందూ మహమ్మదీయు లీ దేశమున నవిభక్తముగ బ్రదికిరి – ఒక కొమ్మలోని రెండు పువ్వులవలె. వారి నాగరికతలు పరస్పరముః బెనఁగొనెను–వారి బ్రతుకులు పెనఁగొన్నట్లు. గత చరిత్రలో మహమ్మదీయులు హిందువులను బాలించిరి ; హిందువులు మహమ్మ

దీయులకు రాజులైరి. కాని, హిందువులు మహమ్మదీయులను గాని, మహమ్మదీయులు హిందువులనుగాని విద్వేషముగఁ జూచికొన్నది లేదు. కవితలో, శిల్పములో, గానములో వారి నాగరికతలు శతాబ్దముల తరబడి మిళితములై పోయినవి. ఆంగ్ల ప్రభువులు దేశమున నడుగిడినదే తడవు ఈ యొద్దికను నాశనము చేయుట కూహించిరి. ఆ నాఁటనుండి వారు విష బీజములను విత్తుచునే వచ్చినారు. మన గత చరిత్రకు వారు దుర్వ్యాఖ్యానము లొనర్చిరి; హిందూ - మహమ్మదీయ కలహములే గత యుద్ధములని నిరూపించుటకుఁ బ్రయత్నించిరి; వారి ధర్మములు, వారి బ్రదుకులు విభిన్నములనియు వా రెన్నఁటికిఁ గలసి మెలఁగఁ జాలరనియు, కృతకములైన హేతువాదములతో నిరూపింపఁ బరిశ్రమించిరి. ఔరంగజేబు హిందూమతము నణఁచెనని చెప్పిరే కాని, అతఁడు హిందువుల కొనర్చిన యుపకారములు మఱుఁగు పుచ్చిరి; టిప్పు సుల్తాను హిందువుల నమితముగ బాధించెనని కథలల్లి, కాయలు పూలు సృష్టించిరి; టిప్పుసుల్తాను శృంగేరి మఠమున కెంతెయో వినీతుఁడు. ఒకసారి మహారాష్ట్రులు దేశమును గొల్లగొట్టికొన వచ్చిరి. వారు శృంగేరి పీఠముపైఁ బడినారు. వారు హిందువులే కదా! మఠమంతయు మహారాష్ట్ర సైనికులు ధ్వంసమొనర్చిరి. ఆ మఠాధిపతి యీ దారుణ విషయమును గూర్చి టిప్పుసుల్తానునకు వార్త చెప్పిపుచ్చెను. అతఁడు సైన్యముతో నెదిరివచ్చి మహారాష్ట్రులను బాఱఁ

ద్రోలినాఁడు. కొన్ని లక్షల దీనారములను ఖర్చుపెట్టి యతఁడు శృంగేరి మఠమును బాగుచేయించెను.

ఈవిషయమును మనచరిత్రలోఁ జెప్పరు. ఇట్టి వానిని జెప్పిన వారి ప్రయోజనములు సిద్ధింపవు. దారా గొప్ప హిందూవేదాంతి. అతఁ డుపనిషత్తులను పారశీభాషలోనికిఁ బరివర్తించెను. పండితరాయలని జగద్విఖ్యాతుఁడగు జగన్నాథునిఁ బోషించినది షాజహానుచక్రవర్తి. గోలకొండ నవాబులు పోషించిన తెలుఁగుకవులకు లెక్కలేదు. పూర్వకాలమున మహమ్మదీయులలో ననేకులు సంస్కృతవిద్వాంసులుండిరి. ఈవిషయముల నన్నిటి నాంగ్లేయులు ప్రయత్నపూర్వకముగఁ బత్రికలనుండి తొలఁగించిరి. విద్యార్థుల పాఠ్యపుస్తకములలోఁగూడ హిందూమహమ్మదీయుల విరోధముల రెచ్చగొట్టు విషయములనే చేర్చిరి. వారి యీ ప్రయత్నము గొంతవఱకు ఫలింపకపోలేదు. మన దేశముననే మతోన్మాదులు బయలుదేరిరి. వాని దుష్ఫలములను నాఁటికిని నేఁటికిని మన మనుభవించుచునే యున్నాము.

భారతదేశమహమ్మదీయులు దమకుఁ బ్రత్యేకరాజ్యము గావలెనను నాందోళనము నానాఁడు లేవఁదీసిరి. ఈ యాందోళనమునకు నాయకుఁడు మహమ్మదాలీ జిన్నా. ఈతఁడు మొట్టమొదట కాంగ్రెసునఁ బనిచేసినవాఁడే. సరోజినీదేవి యాతని నెంతయో గౌరవించుచుండెడిది. జిన్నా హిందూముస్లిముల సమైకత కెంతయో ప్రయత్నించిన

వాఁడే. కాని, ప్రయోజనమేమి? కథ యడ్డము దిరిగినది. భారత దేశము విభజన జరిగితీరవలెనని యాతఁడు పట్టు పట్టెను. ఈపట్టుదలను మాన్పుటకు కాంగ్రెసుపెద్ద లెంతయో ప్రయత్నించిరి. వారి ప్రయత్నములు వమ్మైపోయినవి. ఈ యాందోళన మహాత్ముని మనసుకు గొడ్డలిపెట్టయ్యెను. సరోజినీదేవిహృదయ మాకంపితమయ్యెను. హిందూ మహమ్మదీయసమైకత సరోజినీదేవికిఁ బ్రాణప్రియమైన వస్తువు. ఆమె యింతకుముందీవిషయమునకై యెంతయో ప్రయత్నించినది; అనేక వేదికలనుండి గంభీరోపన్యాసము లిచ్చెను. కాని, అవియన్నియు నూషరక్షేత్రమునవిత్తిన విత్తులై పోయినవి. ఈబోనును సిద్ధపరచిన దాంగ్లేయప్రభువులు. జిన్నా వంటి పెద్ద లాబోనులోఁ బడిరి. దేశవిభజన జరగువఱకును స్వాతంత్ర్యదానము సేయరాదని జిన్నా యాంగ్లేయప్రభువులను నిర్బంధించెను. మహమ్మదీయు లెక్కువగానున్న భాగముల నొక్కటిగాఁజేర్చి దానిని ప్రత్యేకరాజ్యముగ గమనింపవలెనని జిన్నా యెత్తిన పట్టుదల. దాని కాతఁడు "పాకిస్తాన్" అని నామకరణ మొనర్చినాఁడు.

జిన్నా యారంభించిన యాందోళనమును గొందఱు మహమ్మదీయులు 'సైఁ'యనిరి. దీనిని వా రొకమతసేవ యని తలఁచినారు. భావికాలమున దేశచరిత్రలోఁ దమ నామములు స్వర్ణాక్షరములతో లిఖింపఁబడుననియు, వారి యీమతసేవ కాలమున మఱచిపోదనియు వారి విశ్వాసము.

మహమ్మదీయులకుఁ బ్రత్యేకరాజ్యము గావలెననుఘోషలు మిన్నుముట్టినవి.

ఆంగ్ల ప్రభువుల కింతకన్న ననుకూల మేమికావలెను? వారు తిన్నగ ధర్మోపదేశము లొనర్ప మొదలుపెట్టిరి. "మీలో మీకు సామరస్యము లేదు. హిందూమహమ్మదీయు లెప్పుడును బరస్పరముఁ గత్తిదూసికొనుచుందురు. మిమ్ము నమ్మి మేము స్వాతంత్ర్య మొసఁగినచో దానిని నిలిపికొందు రని యేమి నమ్మకము? మీలో మీరు గలహించికొన నారంభింతురు. ఈయదను గనిపెట్టి పరదేశములు మీపైఁబడి స్వాతంత్ర్యమును గబళించివేయును. అంతేకాదు; మీలో నెవ్వరును భారతదేశప్రజ కేకైక ప్రతినిధులు గారు. అయినచో నిన్నిచీలిక లెందుకుండును? కనుక, మీ రింకను, గొన్ని పౌరధర్మములు నేర్చికొనవలెను. వానిని నేర్పుటకే మేము మీ దేశమునకు వచ్చితిమి. ఆంగ్లభాషతో మీ రెంతయో నాగరికులైతిరి. మీకు విశాలదృష్టి నొసఁగినది మేమే; పాతాళమున నున్నవారిని స్వర్గమున కెత్తితిమి. ఈనాఁడు మమ్ముఁ గదలిపొమ్మనుట కృతఘ్నత." ఇట్టి వే వేవో వారవు డాడినమాటలు. ఒకవైపిట్లు భాషించుచునే మఱియొకవైపు జిన్నాప్రభృతులను వా రెక్కుపెట్టుచుండిరి. దేశ మల్లకల్లోలముగా మాఱినది.

ఈవిషమపరిణామముల కెక్కువ బాధపడినది ముఖ్యముగ సరోజినీదేవి. ఆమె చిన్ననాఁటనుండియు హిందువులను, మహమ్మదీయులను సమానముగఁ బ్రేమించెను. ఆమె బాల్యమునఁ గలసిమెలసి యాడుకొన్న మహమ్మదీయ

మిత్రులును హిందూమిత్రులును ఎందఱోయుండిరి. వారి యాచారవ్యవహారములు నామెకుఁ జిన్ననాఁటనుండియుఁ బరిచితములే! ఈదారుణపరిస్థితు లామె భావములఁ గుదిలించివేసినవి. తాను రాజకీయములలోఁ బ్రవేశించిన నాఁటనుండియు సరోజినీదేవి హిందూముస్లింసఖ్యతనే ప్రోది చేయుచువచ్చినది. ఆమహాభవనము నామె యిటుకపై యిటుకపెట్టి కట్టికొనుచువచ్చినది. శాంతిమయమైన యాభవనము జిన్నా ప్రభృతులవంటి వారి మూలమున ముక్కలుచెక్కలై పోవుపరిస్థితి యేర్పడినది. ఆమె మహమ్మదీయుల యింటింటికిని బోయి మొఱపెట్టికొన్నది. ముస్లిములు దమతోనే కలసిమెలసి బ్రదుకవలసినదని బతిమాలినది; హేతువాదముల నొప్పింపఁజూచినది. ఆప్రయత్నముతో నా గుండెలు గరఁగలేదు. గానమునకు శిలలు గరఁగుననుట కళాప్రపంచపుఁబలుకు. మహమ్మదీయులు హిందువులతోఁ జేరి బ్రదుకుటకు సమ్మతింపనే లేదు. వారు మంకుపట్టు పట్టిరి. కారణమేమన వారి సమస్య పరిష్కరింపఁబడనిది హిందూదేశమునకు స్వాతంత్ర్యము రాదని వారెఱుఁగుదురు. భారతదేశమునకు స్వాతంత్ర్యమును సంపాదించువిషయమై యెంత పట్టుదలయున్నదియు వారికిఁ దెలియును. కనుక, హిందువులు తమకోర్కె లంగీకరించితీరుదురని జిన్నాప్రభృతులకుఁ దెలిసిన సత్యమే! అందుచే వారు దమ పట్టుదలను లేశమును సడలింపలేదు.

చాల దురదృష్టకరములైననాళ్లవి. భారతమున హిందూముస్లిములకుఁ గలఁతలు పెల్లుగరేఁగినవి. బయటి

దేశముల భయంకరయుద్ధము. అదియే రెండవ ప్రపంచ సంగ్రామము. హిట్లరు ధూమకేతువువలె విజృంభించెను. జర్మనీ దేశము తిన్నతిన్నగా యూరపుఖండమును గబళింప నారంభించెను. దానితో బ్రిటిషు ఫ్రాన్సు దేశములు భయ భ్రాంతములైనవి. వాఁ డెపుడో యొకనాఁడు దమపై వచ్చి పడును. ఈరెండు దేశము లేకమయ్యెను. అ మె రి కా సాయము వచ్చినది. చిన్నచిన్న రాజ్యములవారును వీరినిఁ జేరి హిట్లరుపై యుద్ధమును బ్రకటించిరి. జపాను జర్మనీలకు మైత్రి గుదిరినది. జపాను ఏషియా ఖండమున నున్నది. ఈ రాజ్యము సామాన్యమైనది గాదు. దేశము చిన్నదైనను గొప్పబలము దానికున్నది. జర్మనీ జపాను లొక్కటియగు టతో హిట్లరునకు ఱెక్కలు మొలచినవి. వాఁ డింకను విజృంభించెను. ఇంతలో రష్యా బ్రిటిషువారితోఁ జేరినది. హిట్లరుజీవితమున క్షీణదశ యారంభమయ్యెను. ఈసన్ని వేశ మున హిట్లరు ప్రకటించినది గొంత తొందరయే. అతఁడు రష్యాతో ద్వేషమును బెంచికొనియుండరాదు. మానవుఁ డెంత విజ్ఞుఁడైనను వానికంటెను బలవత్తరమైనది దైవము. హిట్లరు రష్యాపై కెత్తెను. రష్యా దేశము జర్మనీభవిష్యత్తును దేల్చివేసెను. రష్యనుల శౌర్యముముందు జర్మనీ పటాపంచ లయ్యెను.

బయటిప్రపంచములో నింతటికల్లోలము జరగు చున్నను భారతదేశధర్మసూత్ర మొక్కటియే! సత్యా హింసలు. ఈదేశమున కష్టాడు ప్రత్యేకత లేదు. అస్వతంత్ర దేశముయొక్క యభిమానమునకు విలువ యేమున్నది?

బ్రిటను యుద్ధములో దిగినది. దానితోపాటు భారతదేశ మును దిగినట్లే. ప్రత్యేకముగ నీయభిప్రాయమేమని యెవ్వ రడిగిరి గనుక! భారతమునుండి యుద్ధవ్యయమునకై ధనరాసులు వెళ్లెను. అనేకయువకు లాయుద్ధమునఁ బోరాడవలసివచ్చెను. యుద్ధమున కిష్టమున్నను లేకున్నను బానిసదేశముల పరిణామ మింతే. ఈయదనును కాంగ్రెసువాడుకొని పరిపాలకవర్గము నిట్లుప్రశ్నించెను: "మీరు మాధనమును యుద్ధమున వెచ్చించు చున్నారు; మా యువకులను సమరమునఁ బోరాడఁగోరు చున్నారు. దీనికై మీరు మాకొసఁగు ప్రతిఫలమేమి? యుద్ధానంతరము మాకు స్వరాజ్యమిత్తురా? అల్పరాజ్యముల స్వాతంత్ర్యరక్షణకై పోరాడుచున్నామని ప్రపంచమున కెలుఁగెత్తిచాటితిరి. మరి మీరో? శతాబ్దముల తరబడి మమ్ము దాస్యమున బంధించితిరి. హిట్లరుగూడ నింతే. మఱి మీయిరువురకును భేద మేమున్నది? యుద్ధానంతరము మాకు స్వాతంత్ర్యము నొసఁగెదమని మాటయిండు. మేము మీతోఁ బోరెదము. కానిచో మేము మీతో సహకరింపము."

"అట్లైనచో మీరు జర్మనీ జపానులకు మిత్రకూటము లోనివారా?" ఇది బ్రిటిషుజాతి మనల నెదురువేసిన ప్రశ్న.

దానికి కాంగ్రెసు వా రిట్లు జవాబొసఁగిరి: "మేము జర్మనీమిత్రులముగాము. దాని రాక్షసకృత్యములకై జర్మనీని ద్వేషింతుము. కాని, వారికంటెను మీలో ఘనత యేమని మా ప్రశ్న. హిట్లరువలెనే మీరును సామ్రాజ్య వాదులు. అతఁడు చిన్న దేశములఁ గబళింపఁజూచు చున్నాఁడు. ఇందులో వానికిని మీకును భేదమేమో మాకుఁ

దెలియువలెను.''

దీనికి బ్రిటిషు పాలకవర్గమునుండి జవాబు రాలేను. వారు వరుసగా దేశనాయకుల బంధింపఁజొచ్చిరి. కారాగారములన్నియు మరియొకసారి త్యాగధనులచే నిండెను. కాంగ్రెసుసంస్థ వార్షికసభలలో ''బ్రిటిషువారు భారతమును వదలిపోవలె''నన్న విషయమును బ్రతిపాదించినది. దేశమంతట నిట్టి నినాదములే మాఱుమ్రోగెను. దేశమున గుండెలలోఁ గుంపటివలెఁ బ్రత్యేకరాజ్యమునకై వాదించెడి ముస్లిములు! ఈ కష్టములతోఁ బెద్దలందఱును బాధపడిరి. సరోజినీదేవియు వారిలో నొక్కతె. బ్రిటిషుజాతి వీరి నెన్నియో రీతుల నవమానించెను. అన్నిటికిని దేశనాయకు లొసఁగిన జవాబొక్కటే! శాంతితో నన్నిటిని సహించుట; ప్రయత్నమును మానకుండుట!

యుద్ధము ముగిసెను. జర్మనీ యోడెను. అమెరికా జపాను దేశమునందలి యొక నగరముపై 'అణుబాంబు'ను బ్రయోగించెను. ఆ భూమియంతయు నాశనమై పోయెను. 'అణుబాంబు' భయంకరమైన యొక యూయుధము; నాగరికులైన శాస్త్రజ్ఞుల బుద్ధిశక్తి ప్రతీపమార్గమునఁ బోయి సృష్టించిన యొక ప్రళయాస్త్ర మది. ఈ యస్త్రమును వారు జర్మనీపైఁ బ్రయోగింపలేను. వారిలో వారి కెన్ని ద్వేషము లున్నను యూరపు ఖండమంతయు నొక్కటే! వారి కెప్పుడును ఏషియాపై సాముదాయికమైన పగ. రెండవ ప్రపంచ సంగ్రామమున జరగిన యీ సంఘటన యీ విషయమును మఱి యొకసారి స్పష్టపఱచెను.

---

# 8. దేశము స్వతంత్రమైనది

రెండవ ప్రపంచ యుద్ధము ముగిసెనే కాని, దాని దుష్ఫలములను మరచిపోవుట కెంతకాలమో పట్టెను. దేశము నందలి ముఖ్యనగరము లెన్నియో కూలిపోయెను. జనులకుఁ దిండి తీర్థములు లేవు. ప్రముఖులైన వారెందఱో యుద్ధమున గతించినారు.

ఈ కష్టములలో భారత స్వాతంత్ర్యము నెదురొ్కనుట యూ ప్రజలకు దుర్భర మనిపించెను. బ్రిటిషువారు భారత దేశమునకు స్వాతంత్ర్య మివ్వ సంకల్పించిరి. అందుకై వారు 1942 వ సంవత్సరమున మౌంట్ బాటన్ ప్రభువు అను నాతని భారత దేశమునకుఁ బంపినారు. స్వాతంత్ర్య ప్రదాన మంత సులభమైన పని గాదు. దాని ముందు వెనుకల నెన్నియో యేర్పాట్లు జరుగవలసి యుండెను. మౌంట్ బాటన్ చాల విజ్ఞుఁడు. ఆతఁ డీ కృత్యముల నెంతయో దక్షతతో నిర్వ హించెను. 1947 వ సంవత్సరము ఆగస్టు 15 వ తేదీన భారత దేశము స్వతంత్రమైనదని ప్రకటింపఁబడినది. ఆనాఁడే 'పాకిస్తాను'కుఁ గూడ పునాదు వేసిరి. ఈ సమయమునఁ జెదరు చెదరుగా మత కలహములు రేఁగినవి. ఇవి దేశ నాయకుల మనస్సుల నెంతయో యాందోళన పఱచెను. కాని, వా రేమి చేయఁగలరు? ఇరు జాతులందును మతోన్మాదులు చెలరేఁగిరి. కాని, యూ కల్లోలములను బరిపాలకులును, దేశ నాయకులును సమర్థతతో వేగముగ నార్పి వేసిరి.

దేశము స్వతంత్రమైన పిమ్మట సరోజినీదేవి యుత్తర ప్రదేశములకు గవర్నరైనది. ఇది గొప్ప గౌరవము. ఈ గౌరవముతో నామె శాంతిఁబొందలేదు. ఆమె జీవితమే కార్యమయమైనది. సేవయే యామె యూర్పు. తనకీ యధికారము పక్షిని బంజరములో బంధించుట వంటిదని సరోజినీదేవి తలఁచుచుండెను. ఆమె రాజకీయములలోఁ బ్రవేశించినది యధికారమునకై కాదు. ఇదియే యామె యాదర్శమైనచో నింత కష్టపడవలసిన పనిలేదు. ఆమె గవర్నరుపని నెంతో సమర్థతతో నిర్వహించెను. ఆ జనులు సరోజినీదేవి నెంతయో ప్రేమించిరి.

ఇంతలో మఱియొక దుస్సంఘటన జరగెను. అది గాంధీజీ హత్య. అతఁడు విరక్తుఁడు; అనాసక్తుఁడు; స్వాతంత్ర్యము సంపాదించిన వేడుకలలో దేశమంతయుఁ బ్రుళ్ళిపడుచున్నప్పు డా విజ్ఞాన వృద్ధుఁడు నఱకులాడుకొను చున్న జనులను రక్షించుటకై నవఖాళీ ప్రాంతములకు నడచి వెళ్లినాఁడు. అతఁ డూరూరఁ దిరిగెను; ఇంటింట శాంతి దీపమును వెలిగించినాఁడు. ఇంత కష్టపడి స్వాతంత్ర్యమును సంపాదించిన మహనీయుఁ డా వేడుకలలో నొక్క దినమైనను బాల్గొనలేదు. "నా కర్మక్షేత్రము నవఖాళీలో నున్న" దన్నాఁడు. గాంధీ మహాత్ముని జీవితరహస్య మదే! ఆ మనుష్యునకు గౌరవములు కాఁబట్టవు. తా నింత సాధించితి నన్న యహంకార మాతనికి సున్న. ఆర్తుల నుద్ధరించుటయే యాయన వ్రతము. నవఖాళీలోని నఱకు లాటలు నిలిచి పోయినవి.

మహాత్ముఁడు ఢిల్లీకి మరలివచ్చెను. అతఁ డుదయాస్తమయములలోఁ బ్రార్థన సేయుట వాడుక. అదియును సామూహికమే. ఆ దేవమానవుఁ డా ప్రార్థన యొనర్చుటకై నడచి వచ్చుచుండెను. అతనివెంట సిబ్బంది లేదు; శరీర రక్షకులు లేరు. అట్టి యేర్పాటుల కాయన సమ్మతించెడు వాఁడు గాఁడు. తన దేశ ప్రజలపై మహాత్మున కంత విశ్వాసము; భగవంతునిపై నంత నమ్మకము. ఇంతలో నొక్క యువకుఁ డాతని కెదురు పడెను. అతఁడు మహాత్మునిపై గుండు ప్రేల్చినాఁడు. గాంధీ క్రిందఁబడెను. రామ నామము నుచ్చరించుచు నా దివ్యజ్యోతి యాఱిపోయినది. గాంధీ మహాత్ముఁడు ప్రపంచ చరిత్రలో నొక యాశ్చర్యము! దేశ చరిత్రలో నెందఱో యోగులు జన్మించిరి. సాధువులు పుట్టిరి. కాని, యిహ పరముల నిట్లు జోడించి రాజకీయములలో మార్పు దెచ్చిన మహాయోగి గాంధీమహాత్ముఁ డొక్కఁడే! ఆతఁడు జన్మించుటచే భారత దేశము పవిత్రమైనది.

గాంధీ మహాత్ముని నిర్యాణముతో భారత దేశమునకుఁ బెద్ద దెబ్బ తగిలెను. కాని, యేమ్చేమాత్రము సాధించునదేమి? జన్మ యున్నపుడు మరణము దప్పదు. సంయోగమే భావి వియోగమునకు గుర్తు.

సరోజినీదేవివయ స్సిప్పుడు డెబ్బది సంవత్సరములు. సుమారేఁబది సంవత్సరములకుఁ బైఁగా నామె రాజకీయ జీవితము నడపెను. ఆమె లేఁబ్రాయము నందున్నప్పుడును గర్తవ్యమును నిర్వహింపక యలసురాలై యున్నది లేదు. వయ స్సెదిగి వచ్చినప్పుడును గర్తవ్య పరాయణత్వమును

మానలేదు. శరీరము వయస్సుతో డస్సిపోయినప్పుడు గూడ దనసుఖమును లెక్కింపక దేశక్షేమమునకై సేవగళ్ళుశ్రమించిన క్రియాశీలి యామె! కాని, మహాత్ముని వియోగ మామె యెదలోఁ దీవ్రబాణమై గ్రుచ్చికొన్నది. ఒకసారి యామె ఢిల్లీ కేఁగుచు రైలులో వాంతి యొనర్చికొన్నదఁట! ఢిల్లీలో నామె తీవ్ర శిరోవేదనచే బాధపడుచున్నను దన పనులు ముగించికొని లక్నోకుఁ దిరిగి వెళ్ళినది! మఱి యాజబ్బు నిలువనే లేదు. క్రమక్రమముగ నది దగ్గుగా మాఱినది. అది యొక విధమైన యుబ్బసపు వ్యాధి. అది నానాఁటికిని బెరిఁగినది. ఎందఱో వైద్యులు చికిత్స గావించిరి. ఆ రోగము తగ్గలేదు. అది రోగముగాదు; భగవంతుని పిలుపు. 1949 వ సంవత్సరము మార్చి రెండవ తేదినాఁ డామె నిద్రించుచున్నట్లు గన్నుమూసెను. ఆ నిద్ర శాశ్వతమైన నిద్ర.

భారత రాజకీయములను సంగీతమయ మొనర్చుటకై యవతరించిన దేవి యామె! ఆమె మరణముతో భారతీయ కవితోద్యానములు మూగవోయి నట్లయ్యెను. అగమ్యలోకములనుండి యవని కరుదెంచిన దివ్యగానముతో విశ్వము నలరించిన విశ్వమహతి మరల నగమ్య లోకముల కేఁగెను. ఆలోకములు మన కగమ్యములు. ఆ వీణా కలకలము మనకు వినఁబడుట లేదు. కాని, యా దివ్యమహతి దేవలోకమునఁ గూడ నిరంతరముఁ బాడుచునే యుండునేమో!!!

